# అస్తిత్వం - అరాజకత్వం

## (Existance - Anarchism)




గొరక్

శ్రమైక్య ప్రచురణలు

పిఠాపురం

# అస్తిత్వం - అరాజకత్వం
# (Existance - Anarchism)




## గౌరవ్

" ప్రజల వలనే రచయిత మేధావిగా ఉన్నాడు. వారి నుంచే వచ్చాడు. అతని విజ్ఞానం ప్రజలకి రుణపడి ఉంది. అందువల్ల వారిలో వాడుగా, వారితోనే అతను ఉండాలి"

- జీన్‌పాల్ సార్త్రే

**- అరాజకత్వ అధ్యయన కేంద్రం**

అస్తిత్వం - అరాజకత్వం
(Existance - Anarchism)

ప్రతులకు : 9032094492

ప్రచురణ కాలం : జనవరి 2012

అరాజకత్వ అధ్యయన కేంద్రం ఆధ్వర్యంలో
శ్రమైక్య ప్రచురణలు
పిఠాపురం.

ప్రతిపాదిత చందా :
రూ॥ **20/-** (ఇరువయి రూపాయిలు)

**<u>అంకితం</u>**

**సమతా-మానవతా వాదులందరికి...**

# తొలిపలుకు

## "I Think, therefore I exist"

- *Rene Descartes* (1596-1650)

పరిణితి చెందిన ఆలోచన పశువుని మనిషిగా చేస్తే, చతికిలబడిన ఆలోచన మనిషిని పశువుగా మారుస్తుంది. మనిషి మానసిక గమనం అతడి ఆలోచనల్ని ఎంతవరకు నిర్దేశిస్తుందో, పక్వత పొందిన ఆలోచనా విధానం అతడి ఆచరణని సైతం అంతమేరకూ అమలుజేయగలుగుతుంది. అందుకే మార్పుని అణువణువునా ఆహ్వానించే వ్యక్తిత్వాల్లోకి వైరుధ్యాలు సహజం. తిరోగమన దిశగా పయనిస్తే తప్ప లేకుంటే వాటి అస్తిత్వాన్ని శంకించనవశరం లేదు.

నా అక్షరాల్లో వైరుధ్యాలు శోధించే కుతుహలీకులకు, కుతి తీర్చుకోవడం కోసం తప్పులు వెతికే తక్కేడగాళ్ళకూ నాది ఇదే మనవి. ఆలోచనల్ని ఒకే గాడిలో పెట్టుకోవడం నా వల్లే కాదు, ఏ అన్వేషి వల్లా కాదు. అభిప్రాయాల విషయంలో గిరీశం స్టేట్‌మెంటు పొలిటీషియన్స్‌కి వర్తించినా లేకున్నా ఫిలాసఫర్స్‌కి మట్టుకు వర్తించి తీరుతుంది. ఒకే నూది బెజ్జంలోంచి తోచినంత కాలాన్ని సాగినంతవేర గడిపేద్దామనేది సరైనది కాదు.

అబివృద్ధని  మనమనుకుంటున్న ఆధునికత మా అత్త(బాగ్యలక్ష్మి)ని ఆత్మహత్యకి ప్రేరేపించి హత్య చేసిన పన్నెండు సంవత్సరాలకి మా అన్నయ్య (సుమిత్, పెద్దమ్మ కొడుకు) ను కూడా అదే నాగరికత క్రూరంగా బలితీసుకుంది. ఒకానొక క్రమబద్ధీకరించబడిన జీవనవిదానపు చట్రంలో చిక్కుకుని అసువులుబాసిన సంఘటనల్ని, మన బానిస భావాలకి అనుగుణంగా ఆత్మహత్యలుగానో, ప్రమాదాలుగానో చిత్రించుకుని సమాధానపడే అలవాటు ఇప్పటికే ఈ సమాజం మనకి నేర్పింది.

ప్రజాశ్రేణులు ప్రభుత్వాల, మతాల అస్తిత్వాన్ని ప్రశ్నించకుండా ఉన్నంతకాలం జరుగుబాటవుతున్నదే జీవితమని నమ్మించే భ్రమల్ని అన్నిరకాలుగా జనాల మెదళ్లో బలంగా నాటే కార్యక్రమాన్ని నిరంతరం అమలు చేస్తూనే వుంటాయి మత రాజ్యాలు. మనుషులు మనుషులుగా తప్ప తక్కిన ఏ జీవ జంతువులా బతుకీడ్చినా వారి మనుగడకి కావలసిన భద్రతా, భరోసా నిస్సిగ్గుగా ఇవ్వడానికిగాను ఎల్లప్పుడూ మత రాజ్యాలనేవి ముందే ఉంటాయి.

నానాటికీ వెనకడుగేస్తున్న వ్యవస్థ, వెర్రితలలు వేస్తున్న యువతరం నడత, వెక్కిరిస్తోన్న సమాజపు నూతన పోకడలు, ప్రజానికంలో దినదినాభివృద్ధి చెందుతోన్న

భయంకరమయిన నిర్లిప్తత, ప్రశ్నించే వైఖరిని ఖండించే సంప్రదాయాలు, చైతన్యాన్ని వధించే దండయాత్రలు, అక్షరాన్ని వేధించాలనుకునే దుండగ మనస్తత్వాలు,కులం కంపూ, మతం మత్తూ, వర్గవైరాలు, లింగబేదాలు కలిపి మొత్తంగా సంఘాన్ని ప్రమాదపుటంచున నిలబెట్టాయి.

వ్యవస్థ నడకని దిశానిర్దేశం చేస్తోన్న వికారాలన్నింటినీ వివిధ ప్రత్యేకమయిన పేర్లతో మనం నవీనత (Modernity) అనుకుంటున్నాం. మనకి లేదా మనలాంటి ఇతర ప్రజలకి పూర్తిగా అందుబాటులో లేని అనవశరపు ఆడంబరాలన్నింటినీ అనుభవిస్తున్నట్లు భ్రమచెందడం, అలా మనం అనుభవిస్తున్నామని ప్రపంచాన్ని నమ్మించడం కోసం వెంపర్లాడడం ఈనాటి అత్యాధునిక యుగపు అశుద్ధ సూత్రాలు. సమాజం జ్ఞాన సన్యాసం తీసుకోడానికి అవే కారణాలు.

ఈ మధ్యనే ఈ అంశంపై కరపత్రం కూడా రాసా. సంబంధిత విషయంతో బాటుప్రజా ఉద్యమాల్లో ప్రదాన పాత్ర వహిస్తోన్న ప్రజలకి, ప్రజా ఉద్యమ మిత్రులకి కూడా ప్రజా ఉద్యమాలకీ, ప్రజాతంత్ర ఉద్యమాలకి గల వ్యత్యాసాలు తెలుసుకోవడం అవశరం. ఎందుకంటే,బౌతిక నిర్మాణంపై ఉన్న కుతి బౌద్ధిక పరిణామం పై ఉండదు. భావ విప్లవం పరిపక్వత పొందకుండా ఒకరిద్దరు కల్సి కృత్రిమ హడావుడి చేసినంతలో ప్రగతిశీల ఉద్యమం ప్రారంభమయినట్లు కాదు.

విపరీతమయిన విద్వంసాల వలనా, వినాశనానికి దారితీసే విచ్చిన్న కార్యాలవలనా వ్యవస్థ మారిన దాఖలాలు లేవు. తాత్కాలికమయిన తాటాకు చప్పుళ్ళతో సామ్రాజ్యాన్ని సమాధి చేద్దామని చంకలు గుద్దుకున్న చెదరంగ సంఘాలన్నీ సాంఘిక చరిత్రలో అంతర్ధానమయిపోవడమో, అలసిపోయి విశ్రాంతి తీసుకోవడమో సంభవించింది తప్ప సాధించిందేదీ లేదు. శతాబ్దాల ఉద్యమ చరిత్ర మన విజ్ఞతకి అందించిన స్ఫూర్తి ఏదైనా వుంటే, అది ప్రజల ఆలోచనా విధానంలో ముందుగా మార్పు తేవాలన్న ముఖ్యమైన విషయమెక్కటే.

అస్తిత్వం గురించిన అవగాహన ప్రజలకి లేకుండా, అసలు తమ అస్తిత్వ పరిస్థితి వారికి అవగతం కాకుండా, మన 'వెనకాల' వారినుంచి మనం మాత్రం 'ముందుంటూ' మానసిక వైకల్యాన్ని అట్టహాసంగా ప్రదర్శించుకున్నంతలో సామూహిక ఉద్రేకాలన్నీ ఉద్యమాలయిపోవు. ప్రజలు పాల్గొనే ప్రజా ఉద్యమాలుగా ఈనాటి రాబందు రాజకీయ పార్టీలు పేర్కొంటున్నవి నిజానికి ప్రజాతంత్ర ఉద్యమాలు కావు. అవి అమ్ముడుపోయేందుకు జతకట్టిన అజ్ఞాన కూటములు మాత్రమే.

సమాజంలో సమానత్వం సాధించనంతవరకూ సంస్కరణాలెన్నొచ్చినా సంఘర్షణ సమసిపోదు. సమస్యలకి సర్దుకుపోయే బానిస మనస్తత్వంతోబాటు సమూలంగా మార్పునాహ్వానించే తిరుగుబాటు తత్వం కూడా జనశ్రేణుల్లో స్ఫురించకపోదు. సాదారణంగా బహిర్గతం కానంతలో ప్రజానీకం నిద్రపోతోందనో, అబాగ్యులందరికీ సమానవకాసాలు సమకూరాయనో అర్ధంకాదు. విప్లవమనేది విరుచుకువడే ఉప్పెన. ఉదాశీనస్థితిని మాత్రమే ఎరిగిన ప్రభుత్వాలకి దాని ఉధృతి రుచి తెలియదు.

**విప్లవాభినందనలతో...**

గౌరవ్

---

" నా రచనలు చదివిన పాఠకులు వాటిని మరచిపోగల స్థాయిలో రచనలు సాగించాలని కోరుకుంటున్నాను. నా రచనలు శాశ్వతాలై ఉండాలన్న పేరాస నాకు లేదు. భావి తరాలవారు శాస్త్రీయ విమర్శనా కుశలురైతే నాకు సంతృప్తి. సమాజం మారుతూ ఉంది. మార్పు ప్రభావం మానవుడి మేధస్సుపై పడుతూనే ఉంటుంది. యువతరం కొరకే నేను కలం పట్టాను. వారి మీద నాకు ఎంతో ఆశ ఉంది. ఈ సమాజాన్ని మార్చగల దిట్టలువారే." **రాహుల్ సాంకృత్యాయన్**

**గౌరవ్ ఇతర రచనలు**

1. ప్రజాస్వామ్య పతనం
2. అరాజకత్వం అంటే ఏమిటి ?
3. సాంఘిక తత్వం - వైప్లవ మార్గం
4. ఒక నాస్తికుడి నామా !
5. ప్రజాస్వామ్య ప్రస్తానం

అనేక ఇతర కరపత్రాలు

**అముద్రితాలు - అసంపూర్ణాలు**

1. మద్యంపై యుద్ధం
2. తత్వవిచారణ - తర్కవివేచన
3. కరపత్రాల కథా కమామీషు
4. భగ్న హృదయం
5. Epistimological Enquiry of Primitive Phlosophical Evolution

"To be governed is to be watched, inspected, spied upon, directed,law-driven,numbered, regulated, enrolled, indoctrinated, preached at, Controlled, cheaked, estimated, valued, ensured, commanded, by creatures who have neither the right nor the wisdom nor the virtue to do so. To be governed is to be at every operation, at every transaction noted, registered, counted, taxed, stamped, measured,numbered,assessed, licensed, authorized, admonished, prevented, forbidden, reformed, corrected, punished. It is under pretext of public utility, and in the name of public interest to be placed under cotribution, drilled,fleeced, exploited, monopolized, contorted from, squeezed, hoaxed, robbed; then, at the slightest resistance, the first word of complaint, to be repressed, fined, vilified, harassed, hunted down, abused, clubed, disarmed, bound, choked, imprisoned, indged, condmned, shot, deported, sacrificed, sold, betrayed; and to crown all mocked, ridiculed, derided, outraged, dishonoured. Thatis government; that is its justice; that is its morality."

**- Pierre -Joseph-Proudhan**

Anarchist Philosopher

# అసలుకి కొసరు

కొద్ది సంవత్సరాల క్రితం మాట. " మాలాధారాణ మూర్ఖులారా..." అనే శీర్షికతో విడుదలయిన నా కరపత్రం సృష్టించిన సంచలనానికి వెర్రెత్తిన వున్మాదులు అనేక విధాల బెదిరిపులకి పాల్పడుతోన్న రోజులు, అప్పటికే అరదశాబ్దం క్రితం ' విశ్వ విజ్ఞాన విద్యా ఆధ్యాత్మిక పీఠం ' అనే వ్యాపార సంస్థ నడుపుతున్న నవాబు పై ' విశ్వ అజ్ఞాన అయోమయ అంధ వ్యాపార పిచ్చి పీఠం 'అంటో కరపత్రం ప్రచురించి బెదిరింపులకు అలవాటుపడి వున్నాను. అంతకు ముందే మరో అయిదుసంవత్సరాల క్రితం ' అఖిలభారత గొలుసుకట్టు వ్యాపారులందరూ (All India Multilevel Marketers) రాజమండ్రి రివర్ బే (River Bay Hotel) లో సమావేశమయ్యా వారి తప్పుడు కార్యాక్రమాన్ని సమర్ధించుకో ప్రయత్నించినవుడు సుమారు అయిదువేలమందికి వ్యతిరేకంగా నేనొక్కణ్ణే కరపత్రాలు ముద్రించి బౌతికంగా దాడికి గురయి భంగపడ్డప్పుడు కలిగిన అనుభవం అప్పటికే వుంది.

ఇదంతా ఎందుకంటే వరిమితి మించిన ప్రవర్తన వున్మాదానికి దారితీస్తుంది. మతమనేది స్వయం ఉన్మాదం. భగవత కృపని స్మరించడంతో ప్రారంభమయ్యే మత పిచ్చ భజనలు, భజంత్రీలు, ఉపవాసాలు, తపోస్నానాలు, తీర్థాలు, దీక్షలూ, ఉత్సవాలు, ఊరేగింపులు... మొదలైన రూపాల్లో వ్యక్తమవుతుంది. ఇది మూఢత్వం. ఈ దశను కూడా దాటితే మనుషులందరినీ తమ మతస్తులుగా మార్చాలనుకోవడం, ఒక మతంపై మరో మతం దుష్ప్రచారం, మతోన్మాదుల అల్లర్లు, హర్తాళ్ళు, మత తీవ్రవాదం, మత ఉగ్రవాదం.. ఇవీ ఫలితాలు. మానసికంగా సమతుల్యత లోపించిన మరికొందరు తమనితాము భగవంతుడి స్వరూపంగా చాటుకుంటారు.అలాంటి బాబాలు, అమ్మలు ఈ దేశంలో వీదికి నలుగురు ఉన్నారు. ఎవరికి వారు తమ నైపుణ్యాన్ని బట్టి కూడబెడుతున్నారు. అందులో మరికొందరు విమర్శల్నించి తప్పించుకోవడానికి జనాల కడుపులుకొట్టి వాళ్లకే కూడుపెట్టి అన్నదాతలనిపించుకుంటున్నారు. ఈ దేశానికి సగం దరిద్రం సిద్ధాంతాల వల్ల వస్తే, ఆ మిగిలిన సగం ఇలాటి సిద్ధుల మూలంగా సంక్రమించింది.

బుద్ధి చెడిన ప్రజలు బుద్ధుడ్నే దేవుడ్ని చేసిన దేశమిది. ఇక్కడ ఎవరైనా భగవత అవతారం ఎత్తొచ్చు. ఎవరికైనా దేవుళ్ళూ, దెయ్యాలూ కనిపించొచ్చు. అవశరమయితే అమ్మలూ, తల్లులూ, ఆత్మలు, పరమాత్మలు పూనకంగా రావొచ్చు. రాత్రికి రాత్రికి కొత్తగా గుళ్ళూ, గోపురాలు వెలియచ్చు. చర్చిలూ, మసీదులు, మందిరాలు, గురుద్వారలు ఒక్కమారే ధ్వంసమూ కావొచ్చు. ఒక మతస్తుడు మరో మతస్తుడ్ని

చంపేయనూ వచ్చు.ఒక మతం మరో మతాన్ని సమాధి చేయనూవచ్చు. ఈ మతపిచ్చ రాజ్యంలో రాత్రికి రాత్రి రామరాజ్యం స్థాపించాలనే హిందూ పందులొకవైపు, సగం రాత్రుల్లో కూడా స్వస్థత చేకూర్చి దేశాన్ని దివాళా తీయించాలనే క్రైస్తవ కుక్కలొకవైపు, రాత్రీ పగలూ కూడా నమాజు చేస్తూ రాక్షస పాలన కోసం అల్లాని వేడుకునే నవాబు నక్కలొకవైపు... కానరానిది ఏదయినా వుంటే అది మానవత్వమే కాని మత తత్వం కాదు. మతాలకి, పార్టీలకి అతీతంగా మనగలిగే సమాజాన్ని కాంక్షించడం ఈనాటి మనుషులందరి బాధ్యత. అందుకు కలిసొచ్చే ఆత్మీయ మిత్రులందర్నీ సాదరంగా నా శ్రమలో భాగం పంచుకోమని ఆహ్వానిస్తున్నాను. ఇక చదవండి.

---

"Democracy is not a form of government, but a form of social organization. It is primarily a mode of associated living, of cojoint communicated experiance. It is essentially an attitude of respect and reverence towards our fellow men. "

-Dr. B.R. Ambedkar

# ఆటవికత్వము - అరాజకత్వము

"The World to me, was a world of individual adventure. I wanted to think my own thoughts, find my own friends, and choose my own abode, without regard to tradition or elders or anything but my own tastes.I felt strong enough to stand alone, without the need of buttresses." **-The Autobiography of Betrand Russell**

**" విశ్వమనేది నాకొక విలక్షణమైన వ్యక్తిగత సాహసకృత్యం. నాకు నేనుగానే ఆలోచిస్తాను. హితులెవరో, స్నేహితులెవరో నాకు నేనుగానే తెలుసుకుంటాను. ఆచారాలకి విరుద్ధంగా, పెద్దల కట్టుబాట్లకి కట్టుబడని, ముందు తరాలకి తలవంచని విధంగానే నేను జీవిస్తాను. నా అభిరుచులకి భిన్నమయిన అస్తిత్వానికి నేను అంకితమవ్వాలనుకోను. ఏ రకమైన శక్తికయినా ఒంటరిగా ఎదురొడ్డి నిలవడానికి నాకే విధమయిన ఆసరా అవశరం లేదు."** ***- బెట్రాండ్ రస్సెల్, ఆత్మకథలోంచి***

చాలామంది మేధోమిత్రులకి కూడా హింసోన్మాదానికి సమాంతరంగా వాడే ఆటవికత్వానికి అరాజకత్వానికి పాపం అర్ధమే తెలియదు. వివిధ పత్రికా సంపాదకీయాలు, ప్రసార మాద్యమాల కార్యక్రమాలె అందుకు సాక్ష్యం. ఒకరు తెలీక మొదలెట్టిన తప్పుడు ప్రచారాన్ని తుదివరకూ తలపై పెట్టుకు మోసే జబ్బు ప్రసారమాద్యమాలకి ఈనాటిది కాదు. పత్రికల విషయంలో వారిది స్వభావలోపమయితే, టీవీ చానెళ్ళ విషయంలో విదాన లోపం. సాంప్రదాయ పొరపాట్లని అనుసరించకపోతే అస్తిత్వం ప్రశ్నార్ధకమవుతుందని వారి భాద. ఇందుకే వారసత్వ దోషాల్ని సమర్ధించుకోవడమే ముఖ్యంగా వెళ్లదీస్తున్నారు వారి కార్యక్రమాలన్నింటినీ.ఇదివరలో కూడా సంబంధిత విషయం గురించి చర్చించడం జరిగింది. ఈ మద్యలో అనేకసార్లు తిరిగి అదే తప్పు వివిధ సందర్భాల్లో దర్శనమిచ్చింది.

పోనీ మన అతిరధమహారధులంతా అవగాహన లేమితోనే ఇదంతా చేస్తున్నారనుకుందామన్నా వారి స్థాయికి అది అర్ధంలేని ఆలోచనవుతుంది. మనకెలాగూలేని పదజాల పరిజ్ఞానాన్ని పదిమందికీ కూడా లేకుండా చేసినందువలనా, పదిసార్లు తప్పునే ఒప్పంటూ గగ్గోలు పెట్టినందువలనా వారాశించే ఫలితం ఈసరికే వచ్చిందనుకోవాలి. అందుకే అరాజకత్వం అనే పదాన్ని ఎవరు పట్టించుకుంటారన్న మెండి దైర్యంతోనే ఇష్టమొచ్చినట్లు వుపయోగిస్తున్నారు. మన మతిమంతులకు కూడా అడపాదడపా మతి తప్పడమో, అలాంటిదేమీ లేనట్లు తమ

మేధస్సుని యధాతధంగా ప్రదర్శించుకునే ప్రయత్నాలువారు చేస్తుండడమూ పరిపాటై మొత్తంగా అసలు నిజం చాలా కాలంగా మరుగయిపోయింది.

ఈ సమస్య ఈనాటిది కాదు. ఆరంభం నుంచీ అన్ని కాలాల్లో, అన్ని దేశాల్లో కాలమానాలకతీతంగా ప్రతినత్యాన్వేషి సవాలుగా ఎదుర్కొంటున్నదే. అంతర్జాతీయంగా శాక్కో - వాంజెట్టి ఉదంతం మినహానేను ఇప్పటికే అనేక అంశాలను పేర్కొని ఉన్నాను, కావున జాతీయమయిన విషయమొకటి ఏమిటంటే, చాలా మంది చరిత్రకారులు గుర్తించినట్లు భగత్‌సింగ్, తీవ్ర జాతీయవాది మాత్రమే కాదు. ఆయన అరాజకవాది. 1928 సంవత్సరంలో మే మాసం నుండీ సెప్టెంబరు మాసం వరకూ 'కీర్తి' అనే పంజాబీ పత్రికలో ధారావాహికంగా వ్యాసాలు ప్రచురించాడు. అందులో "The People are scared of the word anarchism. The word anarchism has been abused so much that even in Indian revolutionaries have been called Anarchists to make them unpopular"అంటూ తన విచారాన్ని వెలిబుచ్చాడు. దీనిని బట్టి తెలిసొచ్చేదేమిటంటే, ఆనాటికే అరాజకవాదులనే బిరుదుతో ఉద్యమకారుల్ని వేదిస్తూ తప్పుడు ప్రచారం సాగించారని.

భారత విప్లవకారులు సైతం ఈ రకమయిన ప్రభుత్వ ఎత్తుగడల్నుంచి తప్పించుకోలేకపోయారని భగత్‌సింగ్ అంతటివాడు స్వయానా రాసాడంటే అరాజకత్వమనే పదం ప్రజానీకంలో ఎంతటి అపవాదులకు వేదికయిందో అర్థం చేసుకోవచ్చు. అంతేగాక ఇక్కడ ఇండియాను కూడా కలిపాడేకాని ఇండియా ఒక్కటి మాత్రమే అనలేదు. అంటే ప్రపంచవ్యాప్తంగా అరాజకత్వం పై అరాజకవాదుల పై జరిగిన, జరుగుతోన్న దాడుల తాలూకు చరిత్ర వివరాల పట్ల భగత్‌సింగ్‌కి పరిచయం లేదనుకునేందుకు అవకాశం లేదు. భగత్‌సింగ్ చదివిన గ్రంధాల్లో భగత్‌సింగ్ రాసుకున్న జైలు డైరిలోనూ అరాజకత్వ ప్రభావాన్ని అత్యంత స్పష్టంగా గమనించవచ్చు. నేను ఢిల్లోలో ఉంటుండగా "Supreme Court of India" ఆధ్వర్యంలో నిర్వహించిన "The Trial of Bhagat Singh" ప్రదర్శన నుంచి ప్రస్తుత సమాచారాన్ని తీసుకున్నా.

దక్షిణ భారతదేశంలోనే మొట్టమొదటి రాజకీయ డిటెన్యూ, గదర్ పార్టీ వీరులలో ముఖ్యులూ అయిన దర్శిచెంచయ్య గారి ఆత్మకథ 'నేనూ – నా దేశం' లో గదర్‌పార్టీ స్థాపకుడయిన ప్రముఖ అరాజకవాది లాలాహర్‌దయాళ్ గారి గురించి అనేకమార్లు ప్రస్తావించారు. విద్యార్థిదశలోనే నమ్మశక్యంకాని అంశాలలో విశేష ప్రతిభనార్జించినా, స్కాలర్‌షిప్పుని నిరశిస్తూ రాసిన ఉత్తరాన్ని ప్రభుత్వానికి

వ్యతిరేకంగా పార్లమెంటులో వినిపించినా, అనేక కరపత్రాలు వ్యాసాలతోపాటు మోడరన్ రివ్యూ పత్రికలో ప్రభుత్వంచే నిషేదించబడిన Social conquest of India (భారతదేశ సాంఘిక విజయం) పేరుతో వ్యాసం రాసినా, ప్రపంచంలోని వివిధ దేశాల విప్లవోద్యమాల్లో తలమునకలయినా, 1910లో మోడరన్ రివ్యూలో "Karl Marx - the modern Rishi " (కార్ల్‌మార్క్ – అభినవ ఋషి) అంటూ వ్యాసం రాసినా అవన్నీ ఒక అరాజకవాది ఆత్మవిశ్వాసానికిగాను చారిత్రక ప్రతీకలే.

యావత్ దక్షిణ భారతదేశంలోనే ఏకైక గదర్‌పార్టీ యోధునిగా చెప్పబడే దర్శిచెంచయ్యగారు లాలాహరిదయాల్ వ్యక్తిత్వం నుంచి పొందిన అసాధారణ స్పూర్తి, ఆయన జీవితంలో ఎంతగా ప్రేరణనిచ్చిందో తెలియదుగానీ అక్షరాల్లో మట్టుకు అడుగడుగునా ఒక నిబద్ధతగల అరాజకవాది జీవితం ప్రభావం స్పష్టంగా కనిపిస్తుంది. లాలాహరిదయాళ్‌గారి గురించి ఆరంభలోనే అనేక విషయాలను ప్రస్తావించి, చాలా అంశాలను తడిమి కూడా "హరదయాళు అద్భుత శక్తిని విపులంగా వ్రాయగల శక్తి నాకు లేదు." (నేనూ-నా దేశం -పే-66) అన్నారంటే హారదయాళ్ అపూర్వ వ్యక్తిత్వస్థాయి ఎంత అసామాన్యమైందో అర్ధంచేసుకోవాల్సిందే. గదర్‌పార్టీ పేరులూ, ప్రజల కోసం ప్రాణాల్నిసైతం తృణప్రాయంగా త్యాగం చేసిన ధీరులయిన కర్తార్‌సింగ్, కేదార్‌నాధ్ మొదలగు వారితో పాటు ఎన్నోవేల మంది హరదయాళ్ శిష్యకోటిలో ఉన్నారు.

ఈ అంశాలని గుర్తుచేసుకోవడానికి కారణం, అరాజకత్వం భారతదేశానికి బొత్తిగా అపరిచితం కాదంటూ తెలియుజేయుడానికే. స్వాతంత్ర్యోద్యమ పూర్వదశనుంచీ మొదలుకుని అనేక ప్రజా ఉద్యమాలలో అరాజకత్వ ప్రభావం అత్యంత లోతుగా కనిపిస్తూనే వున్నా, సొంత డప్పు కొట్టుకోవాలనే కుతితో చాలామంది మేధావులు కానిచోట మాత్రం అరాచకమంటూ అల్లాడిపోతున్నట్లు కనిపించీ, తీవ్రవాదాన్ని, వుగ్రవాదాన్ని మట్టుకే అరాజకత్వానికి నానార్ధాలుగా నాన్చుతున్నారు. వీరి తిరోగమన ధోరణి గత కొద్ది సంవత్సరాలుగా నిరంతరాయంగా సాగిపోతూనే వుంది. కాస్తో కూస్తో తెల్సిన వారు సైతం కాలడ్డుపెట్టే దిశగా ప్రయత్నించకపోవడంతో తమకు దొరికిందే నిధనుకునే అజ్ఞాన నిర్లిప్తతకి ప్రస్తుతం ఆంధ్రదేశం చేరుకుంది.

మనకు తెలియనిది తెలిసినట్టు ప్రవర్తించడం ఎంత అవివేకమో, మనకి తెలిసినది మనకు మాత్రమే తెలిసినట్లు ప్రవర్తించడం కూడా అంతే అవివేకం. అస్పష్టమైన అభిప్రాయాల్ని స్పష్టం చేసుకునేది లేకపోగా, అస్పష్టతని సమర్ధించుకునే

ఆలోచనల్ని పెంపొందించడమే ఆధునికతకి పరమార్ధంగా భావించడం ఈనాటి నాగరికత చిహ్నం. అబివృద్ధి చెందిందనుకుంటున్న మన అత్యాధునికత ఆశ్చర్యంగా నిజాయితీగా నేర్చుకోవడం కంటే కూడా అక్రమంగా మన నిపుణత గురించిన గుర్తింపు కోసం ఆతృతపడడమే మనకి నేర్పింది. అందుకే మనకి తెల్సింది ఇంకెవరికీ తెలియనట్లు, మనం వున్నట్లు మరెవరూ ఉండరాదన్నట్లు మనకొక ప్రమాదకరమయిన భ్రమ ఏర్పరుస్తుంది. ఈ అంశాన్ని ఆదారం చేసుకునే ఈనాటి సినిమాలు, కళాకారులు, రాజకీయాలు, నాయకులు, సమాజం...నడుస్తున్నాయి.

ఒక నియమబద్ధ కార్యక్రమాంలో మన ప్రమేయం లేకుండా పాల్గోవడం ప్రస్తుత నవీన వ్యవస్థకి సంబంధించిన ప్రదాన సూత్రం. అందులో భాగంగానే మన జీవనవిధానాలకిగానీ, జీవిత అవశరాలకిగాని ఏ మాత్రం అక్కరకురాని దుస్తుల్ని, వస్తువుల్ని, వాహనాల్ని మనం వాడడానికి అలవాటుపడడం. ఆర్ధికంగా భారమయిన వాటి విషయంలో కూడా సిగ్గులేకుండా నలుగురితో వేనుకబడతామనే అర్ధం లేని భయంతో పనికిరాని పిచ్చి పోకడల్ని పాటించడం. ఆధునికత మనిషి అవశరాల్ని మరింత సులువుగా తీర్చేదిగా ఉండగలగడం సబబుకానీ, కొందరి అవశరాలకి మట్టుకే పరిమితమైందిగానో ఉన్నవి చాలవన్నట్టు నూతన అవశరాల్ని సృష్టించేదిగానో ఉన్నందువల్ల ఒరిగేదేంలేదు. ఈరోజు నాగరికత పుణ్యమా అని మనమనుభవిస్తున్నట్టు భ్రమ కలిగించే సుఖసౌఖ్యాలన్నీ పైత్యం కొద్దీ కావాలని నెత్తినెక్కించుకున్నవే కానీ నిజంగా సమాజానికి అందుబాటులోకి వచ్చినవి తక్కువ.

నాగరికతకి అరాజకత్వం వ్యతిరేకం కాదు. విజ్ఞానశాస్త్ర ఫలితాల్ని మానవాభ్యుదయం కొరకే వినియోగించడం పట్ల అరాజకవాదులకేమీ అభ్యంతరాలుండవ్. అలాకాకుండా శాస్త్రమనేది ఏ కొంతమందికో మాత్రమే పరిమితయి వ్యవస్థని వెలేసినపుడు మాత్రమే దాని అస్తిత్వాన్ని సమిష్టిపరం చేయాలని భావించడం జరుగుతుంది. విజ్ఞానశాస్త్ర ఆవిష్కరణలన్నీ కూడా మానవాళిని మరింత ముందుకు తీసుకెళ్ళే ఉద్దేశంతో సాధించబడవలసినవి కానీ శాస్త్రవిజ్ఞానాన్ని ఏ కొన్ని తరగతులకో పరిమితం చేయవలసినవి కావు. ఐహిక సంతోషాన్ని పెంపొందించడమే ఆధునికత లక్ష్యం కాదు. సమాజంలోని అన్నిరకాల దిగువస్థాయి ప్రజాశ్రేణులకి అందుబాటులోకి వచ్చే విధంగా కృషి చేయడం కూడా ఇందులో ముఖ్యాంశమే. ఈ సందర్బంలో క్రింది వాక్యాల్ని ఊటంకించడం అప్రస్తుతం కాదని అనుకుంటున్నాను.

"Civilization has been an Continuous struggle of the

individual or of groups of individuals against the state and even against "society", that is, against majority subdued and hypnotized by the state and state worship" - Emma Goldman.

## అంతిమత్వం - అరాజకత్వం

"What I believe is a process rather than finality, Finalities are for gods and governments, not for the human intellect" **- Emma Goldman.**

**"నేనేదయితే విశ్వసిస్తానో ఆ విదానం అంతిమత్వాన్ని అంగీకరించదు. అంతిమత్వాలనేవి దేవుళ్ళకీ, ప్రభుత్వాలకేకానీ మానవ మేధకు కాదు.'**

**- ఎమ్మా గోల్డ్‌మేన్**

ఆ మధ్యనొక సభలో మిత్రులు భౌతికవాదులనేవారు, భారతీయ తత్వశాస్త్రం, సంస్కృతీ, సంప్రదాయాల్ని కూడా కలుపుకోవాల్సిన అవసరం వుందనీ నాకు హితోపదేశం చేస్తూ, ఒక కమ్యూనిస్టు భక్తుడు రాసిన వ్యాసనకలు ప్రతిని అందించారు. సరే వారి సరదా కాదనడం ఎందుకని కాస్త లోతుగా హైందవంలోనికి తొంగి చూడ్డం మొదలుపెట్టానో లేదో అప్పడే దాని సౌరభం గుభాళించడం ప్రారంభమైంది. దాని ధాటికి తట్టుకోలేక ఇలా అక్షర ప్రక్షాళనం కావిస్తున్నా. భారతీయ తత్వశాస్త్రాన్ని తగిన రీతిలో శోధించి ప్రస్తుత సమాజగమనాన్ని త్వరితపర్చే శాస్త్రీయ స్ఫూర్తిని వెలికితీసే యత్నాల పట్ల నాస్తికులకు ఏ అభ్యంతరాలూ లేవుకాని 'భారతీయ తత్వం' అనే పదాన్ని హైందవ ఛాందసానికీ, బ్రాహ్మణీయ వారసత్వానికి నానార్థంగా ఉపయోగించడం మాత్రం మాకంగీకారం కాదు.

ఎందుకంటే మతతత్వాన్ని వ్యతిరేకించే ప్రగతికాముకులు హిందూ మతంపైనా, బ్రాహ్మణ వాదంపైనా కాస్త ఎక్కువ మోతాదులో దృష్టి పెట్టడానికి స్పష్టమైన కారణముంది. భారత తత్వ పురోగమనాన్ని తిరోగమన దిశగా మళ్ళించి, భారత ప్రగతి మార్గాల్ని బాజాభజంత్రీల తంతుగా మార్చిన ఘనత హైందవానిదే. హిందూ ఛండాలాన్ని భుజానేసుకుని మోస్తూ దాని బరువుకి భక్తెక్కువయ్యిన మిత్రులందరూ అడపాదడపా మాకు కూడా మతోన్మాదం ఎక్కించాలని ప్రయత్నించడం కద్దు. అంతమాత్రంలో పుట్టిమునిగిపోయిందేమో లేదుగాని ఆ కుతుహలం కాస్తా మోతాదుమించి మెదళ్ళో హాలాహలంగా మరితేనే ప్రమాదం.

మన ముందుతరాల మానవులు వారికి కలిగిన ప్రశ్నలకి జవాబుల కోసం, వారికెదురయిన సవాళ్ళని అధిగమించడం కోసం శ్రమించారు కనుకే మనం

ఈనాడు వారి ప్రయత్న ఫలాలని పొందుతున్నాం. మహా మానవ ప్రస్థానం ఆటవిక దశనుండీ నవనాగరిక స్థాయికి మనిషిని చేర్చింది. జంతువులతోబాటు సమానంగా సంచరించిన మన పూర్వికుల గతం, అంతవరకే పరిమితమై వుంటే ఈరోజు మనం చూస్తోన్న కళ్ళు చెదిరే అభివృద్ధి కలలో కూడా సాధ్యమయ్యేది కాదు. శతాబ్దాల చైతన్యం మనిషికి సంఘర్షణని నేర్పింది. అడగడుగునా అతడికెదురయిన ప్రమాదాల పర్వం అతడికి పోరాట తత్వాన్ని ప్రసాదించింది. నాటి నుంచీ నేటి వరకూ ఏనాడు సాధించబడిన విజయమైనా మనిషి ఆలోచన, ఆచరణల వలన ఆవిష్కరించబడిందే తప్ప అలౌకిక శక్తులేవీ అతడికి తోడ్పాటునివ్వలేదు.

ప్రారంభం నుండీ ప్రవర్ధిల్లుతోన్న ప్రగతి గమనం ఏ దేవుడూ మనకి ప్రసాదించలేదు. ప్రకృతి శక్తులతో నిరంతరం జరిగిన ఘర్షణే మానవుడిని ప్రాకృతిక పోరాట యోద్ధుణ్ణి చేసింది. తన గత అనుభవాల నుంచి పొందవలసిన లోతైన స్ఫూర్తిని మనిషి, కళ్ళుమూసుకుని దేవుడికి గుడ్డిగా అంకితం చేస్తున్నాడు. మానవీయ సంబందాలలో మతమనేదానికి అత్యధిక ప్రాదాన్యతని కల్పించుకుంటూ అతన్నతడే అవమానించుకుంటున్నాడు. నాగరిక మానవుడు ఆచరణాత్మకంగా ఎంత ముందుకు వెళ్ళినా అతడి నరనరానా భక్తిమత భావాలున్నంతవరకూ ఆలోచనాత్మకంగా అనాగరికుడే. ఎందుకంటే, నిజమయిన నాగరికత భావాల్లో వుంటుంది కానీ భాషలోను, వేషంలోను, భవంతుల్లోను కాదు.

'ఆర్థికత-ఆధునికత-అనాగరికత' పేరిట వచ్చిన కరపత్రంలో సంబంధిత విషయాన్ని చర్చించడం జరిగింది. దురదృష్టకరమైన అంశమేంటంటే కొద్దోగొప్పో ఆలోచించగల బుద్ధిమంతులు సైతం ఆధునికత అనుకుంటూ అతి హీనమైన అనాగరిక సాంప్రదాయాలకు గుడ్డిగా వంతపాడడం. ఇదమిద్ధంగా మనకి తెలీని ప్రతీ విషయంలోనూ అప్పటికే వ్యవస్థీకృతమై వున్న ఆచారాల్ని అనుసరించడం మనకొక రుగ్మతగా తయారయింది. ఆలోచించడానికి మాత్రమే పనికిరావలసిన సొంత మెదడు అనుకరిస్తూండడానికి మట్టుకే పరిమితం కావడం నీచం. అందుకే మన సమాజంలో ప్రవర్తించేవారికంటే కూడా పాటించేవారే అధికం. అనుసరించే వారు అదేశాల కోసం ఎదురుచుడడానికి అట్టే కాలం పట్టదు. ఆ పరాధీన బానిసత్వాన్నే భక్తిమార్గామనో, పౌరసత్వమనో పేరు పెట్టుకుని సమాదానపడతారు.

ఈ సమాజం మనకి సర్దుకు జీవించడం కోసం అలవాటు చేసిందేదయినా ఉందంటే అది సమాదానపడడం ఒక్కటే. ఏదో స్థితిలో అవస్థపడుతూ ఆఖరివరకూ లాగుకురావడమే జీవితంగా తలచేవారు, దాన్నే జీవితమని ఎంచేవారు సమాజంలో

నిండుగా వున్నంతకాలం మరో మార్గాన్ని పట్టుకు వేలాడేవారూ, ప్రత్యామ్నాయ దారుల దరిచేరేవారూ దాడులకు గురువుతూనే ఉంటారు. మన ఆచరణ తమ అస్తిత్వానికి భంగకరమని నమ్మేవారూ, మన అస్తిత్వం తమ ఆచరణకి ప్రమాదకరమని భయపడేవారూ, ఆలోచనలన్నింటినీ ఒకే గాడిన కట్టుకుని తత్వం మాట్లాడే వారూ, అందరూ ఎలాగోలా మనల్ని కూడా భాగస్వాముల్ని చేయడం కోసం తోచిన ప్రయత్నం చేస్తుంటారు. వారి ప్రయత్నాలు మనపట్ల సఫలం కానందుకు సంతోషించాలో, ప్రజల్ని కలుపుకోలేని మన ప్రయత్నాలు విఫలమయినందుకు విచారించాలో తెలీని సందిగ్ధావస్థ ఈనాడు దాపురించింది.

ప్రజలు ఉద్యమాల్లోకి రావడంలేదు మొర్రో అంటూ గగ్గోలు పెట్టేవారు ఆలోచించవలసింది అసలు ఉద్యమాలు ప్రజల్లోకి వస్తోన్నాయా లేదా అని. సామాజిక చైతన్యం కోసం చిత్తశుద్ధితో శ్రమిస్తున్నవారు కూడా ప్రజా ఉద్యమాలకీ ప్రజాతంత్ర ఉద్యమాలకి తేడా తేల్చుకోలేకపోతున్నారు. సాంఘిక ఔన్నత్యం గురించి కృషి చేస్తున్న ప్రతీ సంస్థ ఈరోజు తనతో అడుగు కలపడానికి ముందుకురాని కార్యకర్తల లేమితో బాధపడుతూ వునికిని కాపాడుకోవడం కోసం మాత్రమే తోచిన కార్యక్రమాలు నిర్వహించే స్థాయికి దిగజారిపోయింది. ప్రజాశ్రేణుల్లో భావవిప్లవం కోసం పాటుపడడానికి ముందుకొచ్చే ప్రతీ వ్యక్తీ ఎదుర్కోవలసిన మొట్టమొదటి సమస్య ప్రజానీకంలో పాదుకుపోయిన నీచమయిన నిర్లిప్తత. తమ ఉనికిని ప్రశ్నార్థకంగా మలచిన సమస్యలపై కూడా పోరాడడానికి ప్రజల్ని సమీకరించాల్సిన స్థితి మన వైఫల్యాన్ని సూచిస్తోంది.

ఈనాటికీ ఏనాడో తలనెరిసినవార్ని వక్తలుగా పిలుస్తూ కార్యక్రమాల్ని నిర్వహించడమూ ఆనాడే తలనెరిసినవారు శ్రోతలుగా ఉండడమూ జరుగుతోంది. మనం సరైనదని నమ్మినదాన్ని ఎక్కువశాతం సరైనది కాదని నమ్మడంవలన అనుకున్నదాన్ని అమలు చేయలేకపోతున్నామో లేదా మనం సరైందని బావిస్తున్న అంశం నిజంగా సరైనది కాకపోవడం వల్ల మాత్రమే కార్యాచరణకి లోటు వస్తోందా లేక ఎవరికీ సరైనది కానిదాన్ని భిన్నంగా ఉన్నామని నిరూపించడం కోసమే మనం తలకెత్తుకోవడం వల్ల ఏక వ్యక్తిగా మాత్రమే మన గోడు మిగిలిపోతోందా అంటే జవాబు తడమడం తేలికయిన విషయం కాదు. నిజంగా అన్ని సంస్థలూ, సంఘాలూ, సమాఖ్యలు ప్రజల కోసమేపని చేస్తుంటే మరో కొత్త మార్గం తొక్కవలసినంత గత్యంతరం నిజాయితీపరులకి ఎందుకు పడుతోందనేది ప్రశ్నార్థకం. అజేయమయిన జ్ఞానానికి అహంకారం తోడయితే ఆ పరిణామం వేరు కుంపటికి దారితీస్తుందన్న

నిజం ఈ విషయంలో తీసివేయవలసినది కాదేమో తరచి చూడాలి.

ప్రజాస్వామ్యమనేది నిరంతర ప్రక్రియ. ఇదమిద్ధంగా అదెప్పటికీ సాధ్యం కాకున్నా, అసాధ్యమయితే మాత్రం కాదు. ప్రగతివాద వ్యక్తులూ, సంస్థలూ చేసే ప్రయత్నాల వల్ల అది ప్రజానీకానికి అందుబాటులోకి వస్తుంటుంది. అయితే సంపూర్ణ ప్రజాస్వామ్యమనో (Complete Democracy) , పరిపూర్ణ ప్రజాస్వామ్యమనో (Ful-filled Democracy), లేక శాశ్వత ప్రజాస్వామ్యమనో (Perpetual Democracy) నిర్వచించడం సరైనది కాదు. సత్యం లాగా, జ్ఞానం లాగానో ప్రజాస్వామ్యమనే భావన, ఉన్నత వ్యవస్థ గురించిన పిపాసని సూచించే మనిషి జిజ్ఞాసని గురించిన చింతనాత్మక భావనే తప్పా సాధించబడి సంతృప్తిపడే సాంఘిక సిద్ధాంతం కాదు. అందుకే ఎంత గొప్ప ప్రతిపాదనయినా రాబోయే ప్రతిపాదనల సార్వజనీనతకి భంగం కలగని పునాదిగా ప్రవచించబడిందే కాని, అంతిమ సిద్ధాంతంగా అమలయ్యేందుకు ఆవిర్భవించేది కాదు.

అందుకు అతీతంగా ఏదీ లేదు, రాదు. మతం కూడా అందుకే మూర్ఖత్వానికి చిహ్నమై కూడా మార్పును ఆహ్వానించి నూతన పైత్యాన్ని తలకెక్కించుకుని మాత్రమే మనగలిగింది. ఈ విధమయిన పైత్యం సత్యాన్ని గుర్తించడం మాటటుంచి కనీసం దాని దరిదాపులకు కూడా పోడానికి జంకుతుంది. ఇంతకు ముందు నేను ప్రస్తావించిన "మాలాధారణ మూర్ఖులారా..." కరపత్రం చూసి నిజాన్ని చదివి బెంగపడ్డ బచ్చాగాళ్ళు నాపై లుచ్చా బెదిరింపులకు దిగారు. మొగుడు కొట్టినందుక్కాదు, తోడికోడలు దెప్పిందని ఏడ్చిందట వెనుకటికొకత్తె. అలా వుంది ఈ జిడ్డుగాళ్ళ వరస. వీళ్ళ బాధంతా హైందవాన్ని ఉతికారేసినందుకు కాదట. మిగిలిన మతాల్ని కూడా విమర్శించనందుకట. ఈ బడుద్ధాయిలకి తెలీని సంగతమిటంటే నేనే మతాన్ని వదల్లేదు. నాస్తికుడి దృష్టిలో మతాలన్నీ ప్రమాదకర జబ్బులే.

శతాబ్దాల క్రితమే బౌద్ధమత ప్రభావానికి దిమ్మతిరిగి దిక్కులేక, దారి కానరాక బుద్ధుణ్ణే అవతారంగా చేసుకున్న చచ్చు చరిత్ర హైందవానిది. మనుషుల్ని మతస్తులుగా, కులస్తులుగా తప్ప చూడలేని ఈ దేశపు దుర్మార్గ హైందవంపై ప్రతీ ప్రగతి కాముకుడి దృష్టి అధికంగానే వుంటుంది. రచ్చ చేయడం తప్పా చర్చ జరపడం కూడా చాతగాని హిందూ అక్కుపక్షి పారాయణులకి అనాలోచితంగా బెదిరించడమే కానీ సవ్యంగా ఆలోచించడం కూడా రాదు. జనాలకి ఏ మాత్రం మేలు చేయలేని ఇలాటి బాడ్కోగాళ్ళ మకిలి మాటల్ని, వెకిలి నవ్వుల్ని పట్టించుకునేంత తీరికా, ఓపికా నాకు లేవ్. మనిషి చరితంతా సమాజం కోసం పురోగమించిన త్యాగ ధనుల నెత్తుటి

చుక్కలకి రుణపడి ఉండవలసిందేకానీ సాంఘిక గమనాన్ని తుదముట్టించి, సత్యాన్వేషణకి సమాధి కట్టిన ఈ కరడుగట్టిన నీచుల చేతులకి అప్పజెప్పవలసింది కాదు.

" The history of Progress is written in the blood of men and women who have dared to response an unpopular cause"

**- Emma Goldman.**

## అంటరానితనం - అరాజకత్వం

"I do not wish to remove from my present prison to a prison a little larger. I wish to break all prisons" **- Ralph Waldo Emerson**

**"ప్రస్తుత జైల్లోంచి ఇంకొంచెం పెద్దదయిన బంధీఖానాలోకి నేను పోవాలనుకోవడం లేదు. సర్వ ఖైదుల్నుంచి స్వేచ్ఛ పొందడమే నా అభీష్టం."**

***- రాల్ఫ్ వాల్డో ఎమర్సన్.***

మనుషులమని చెప్పే వ్యక్తుల పేర్లకంటే కూడా ఇంటి పేర్లనిబట్టి కులాన్ని తరచి చూసే తహతహే ఈ దేశంలో అధికం. అందుకే పేర్లముందు పిలకలు, పేర్ల చివర తోకలూ సహజం. అనేకమంది ప్రతిపాదించిన పలు అంశాల్ని పరిగణలోకి తీసుకొని తరచి చూస్తే, కులతత్వం వ్యక్తిగతంగా నా కార్యశీల అనుభవం మునుపటికంటే రెట్టింపయిందటోంది. అమ్ముడుపోయే అగ్రవర్ణాల పెద్దల్లో, దళిత దగా దళారుల్లో కులం కనిపించడం లేదంటూ చెంకలు గుద్దుకునే ఔత్సాహికులకు, చూసే ప్రయత్నం చేస్తే ఈ దేశపు నరనరాన నివురుగప్పిన నిప్పులా వ్యాపిస్తూ తన ప్రభావాన్ని ప్రపంచం చూడకుండా జాగ్రత్తపడే కుల జాడ్యం అడుగడుగున దర్శనమిస్తుంది. వైయక్తికంగా కొన్ని వందల వేల సందర్భాల్ని ఈ అంశం పై పేర్కొనదగినన్ని అనుభవాలు నాకున్నాయి.

కులం - చిడుం అంటూ రాసిన నా కరపత్రాన్ని చదివేందుకు జడిసిన పెద్దమనిషి అదచ్చుకాకుండా అడ్డుకున్న వుదంతం మొదలుకుని, అంటరాని వసంతమనే అద్భుతమయిన నవలని సమీక్ష చేసేందుకు కూడా నిరాకరించిన కమ్యూనిస్టు కవి విమర్శక శిఖామణీ, చెన్నైలో, రాజస్థాన్‌లో అగ్రవర్ణ జులుం చూపిన కమ్మ పొగరుకి దిమ్మ తిరిగే నా జవాబు, అస్సాం రాష్ట్రంలో పరిధిదాటి ప్రవర్తించిన 'గౌడ' గేదె మదమణిగేలా ఉద్యోగాన్ని వదిలి అర్ధరాత్రి ఆంధ్రదేశానికి

బయలుదేరినపుడూ, బ్రాహ్మణీయ గజ్జిని తలకెక్కించుకున్న దళిత భాగస్వామిచేత మోసగించబడినపుడూ, నాతో స్మారతం చదివి పౌరోహిత్యం వెలగబెడుతున్న మిత్రుడు " బ్రహ్మణుడివి కాబట్టి ఇప్పిస్తానన్న" ఉద్యోగాన్ని కాదని మొహంపగిలేలా సమాధానం చెప్పినపుడు... కుల క్రౌర్యాన్ని అడుగడుగునా ఎదుర్కొంటూనే ఉన్నాను.

అగ్రవర్ణాల అంటురోగుల్తో పోలిస్తే బహుజన చైతన్యాన్ని భావాత్మకంగా ( Ideologically) ఒంటబట్టించుకున్న అణుగారిన ప్రజలు అతి తక్కువ సంఖ్యలో వుండడం సాంస్కృతిక పునరుజ్జీవనానికి ఆత్మహత్యా సదృశ్యమైన, సిగ్గుచేటైన విషయం. ఈనాటికీ అత్యధికశాతం అణగారిన శ్రేణులు తమకు తెలీకుండానే బ్రాహ్మణీయ వారసత్వాన్ని భుజాలపై మోస్తూ, ఆర్యనాగరిక విషాన్ని నెత్తిన పెట్టుకు తరిస్తున్నాయంటే సనాతన మతం చేసిన అలవాట్లు ఎంత బలంగా ఈ దేశ ప్రజల ఆలోచనల్లో విడదీయరానంతలా వేళ్ళూనుకున్నాయో అర్థం చేసుకోవచ్చు. అందుకే "ప్రాచీన భారత చరిత్రంతా బ్రాహ్మణుల, బ్రాహ్మణేతరుల మధ్య సంఘర్షణే " అంటారు మహాత్మా పూలే.

శతాబ్దాల క్రితం సుత్తి స్మృతికారులు దుర్మార్గంగా రూపొందించిన 'విభజించి పాలించ' నే కుట్రపూరిత సూత్రన్నే నాడు విదేశీయులు, నేడు స్వదేశీ జలగలు ఈ దేశపు ప్రజల విషయంలో అమలుపర్చి లబ్ధి పొందుతున్నారు. కులాలన్నీ నేను గొప్పంటే, నేను గొప్పనీ తమలో తాము తన్నులాడుకుంటుంటే, తమ అస్తిత్వానికేమీ ఢోకాలేదన్న ధీమాతో మరింత బలపడేందుకు ప్రయత్నిస్తున్నాయి బ్రాహ్మణీయ అగ్రవర్ణాలు. కులనిర్మాతల కుటిలత్వం నిజాయితీగల బహుజనులు నేర్చుకోగలిగే నైపుణ్యం లేదు. ఇప్పటికీ ప్రశాంతమైన వాతావరణాన్నే కోరుకుంటూ తోచిన విధంగా జీవించేందుకూ, తప్పితే హక్కుల గురించి మాత్రమే అడిగేందుకు యత్నిస్తోన్న ప్రజల్లో, అగ్రవర్ణాల అస్తిత్వానికిగాను అలంకార పదబంధంగా ఉపయోగపడుతోన్న అహింసా సిద్ధాంతం, ఆచరణాత్మకంగా అణుగారిన జనశ్రేణుల్లో ఏనాడో జీర్ణమైపోబట్టే ఈ దేశంలో ఇంకా దండగమారి పాలన సాగగలుగుతోంది.

మన మేధావులు, ఉద్యమకారులు సైతం ఎంత దయనీయమైన స్థితిలో ఉన్నారంటే వారిరువురికి కూడా కులానికీ - కులతత్వానికీ తేడా తెలీదు. కులతత్వం పై తిరుగులేకుండా పోరాటం చేసినపుడే కులనిర్మూలన సాధ్యమవుతుందనే అవగాహన కూడా మృగ్యం. అణగారిన వర్గాల ప్రజలకి తిరుగుబాటు మార్గాన్ని సైద్ధాంతికంగా అందించి, "అనుకరణ సులువనీ- అన్వేషణ కష్టమని" తెలియజెప్పి "మేకలుగా వద్దూ, పులులుగా మారండ" ని గర్జించి వెనుకబడిన వర్గాల వున్నతికి,

అంటరానివారి అభ్యున్నతికీ అవిరామ కృషి జరిపి ఉద్యమ నిర్మాణ ఉపదేశమయిన " Educate, Agitate, Organize" ని వారికందించిన అంబేద్కర్‌ని క్రైస్తవ మతం మత్తులోనూ, ఇస్లామ్ మత మగతలోను జోగుతూ ఆయన్ని నాస్తికుడనీ, బౌద్ధుడనీ ఆడిపోసుకోవడం పాలు తాగిన తల్లి గుండెల్లో గునపం దించి చంపడంతో సమానం.

పాలంటే జ్ఞాపకం వచ్చింది. జీవితాంతం ఎన్నో ఇబ్బందులకి లోనయి కూడా, ఎంతో శ్రమకోర్చి హిందూ మతమనేది వున్నంతకాలం కులమనేది కూడా వుంటుందని విశ్వసించి, అపూర్వమైన పరిశోధనలతో హిందుత్వాన్ని చీల్చిచెండాడిన అంబేద్కర్ కి ఈనాడు అదే హిందూ సంప్రదాయంలో భాగమైన క్షీరాభిషేకాల్ని ఆయన విగ్రహాలకి చేయడం దారుణం. నిరంతర జ్ఞానతృష్ణ ఆయన్ని ఏ స్థితికీ పరిమితం కాకుండా కాపాడింది. బడుగు, బలహీన, అంటరాని, దళిత వర్గాల సమీకృత పోరాటానికి గాను సశాస్త్రీయమైన సైద్ధాంతిక పునాదిని మొట్టమొదటసారిగా నిర్మించినవాడు అంబేద్కర్. ఆ మధ్య ఆయన వ్యక్తిత్వం పై విష ప్రయత్నం మార్క్సిస్టు మేధావి చేయడం జరిగింది. ఏవో అల్పమయిన పొరాపాట్లని ఆదారం చేసుకుని జీవితకాల కృషిని మరుగుపరచడం ద్రోహం అనబడుతుంది. పుట్టినవారెవరూ పురుషోత్తములు కారు. గణించ దగ్గవారుంటే ఈ దేశపు 'స్పార్టకస్' అంబేద్కర్.

బడుగుజీవుల ఆశాకిరణాలపై బ్రాహ్మణవాద బురద జల్లుడు కార్యక్రమం ఈనాటిది కాదు. అది ఎప్పటినుంచో కొనసాగుతూనే వుంది. ఇప్పటికీ కొనసాగుతోంది. అందుకే, " అగ్రవర్ణాల కళ్ళల్లో నుంచి చూస్తూ అణగారిన ప్రజల విముక్తి కోసం ప్రయత్నిస్తున్న వాళ్ళ మాటల్ని, రాతల్ని విశ్వసించకూడదు. కొండ చిలువలా చుట్టుకుని వున్న బ్రాహ్మణీయ బానిసత్వపు విషకౌగిలి నుంచి కోట్లాది నా సహోదరులకు విముక్తి కలిగించే శక్తి ఈ అర్థసరి అగ్రవర్ణ నాయకులకు లేదు. " అంటారు మహాత్మా పూలే. అస్తిత్వాన్ని నిరూపించుకోవడం కోసం అంతరాత్మని ఏదో పార్టీకి తాకట్టు పెట్టి, ఆత్మగౌరవాన్ని చంపుకోవడమే ప్రధానంగా సాగుతోన్న ఉద్యమ ప్రహసనాల కార్యకర్తలు ఇకనైనా బహుజనుల తత్వశాస్త్రాన్ని అధ్యయనం చేసి ముందుకు వెళ్ళడం మంచిది.

ఆచరణాత్మకమయిన దృక్పదానికి దూరం (Far from pragmatical Atitude) చేయాలనే లక్ష్యంతోనే ఈరోజు కొద్దోగొప్పో జీవించున్న ఉద్యమాలన్నింటినీ పక్కదారి పట్టించడం జరుగుతోంది. అందులో బాగంగానే క్రమ పద్ధతి ప్రకారంగా,

కుట్రపూరిత చట్రంగా సమాజాన్నీ,సమాజంలో ప్రధానమైన యువతరాన్ని, మత్తుకు-భక్తికి, సుఖానికి, సరదాలకు, ఆధునికతను అలవాటు చేయడం జరుగుతోంది. వీటన్నింటికీ మించి సమాజాన్ని స్తబ్దతగా వుంచుతూ, జనాలని నిత్యం నిర్లిప్తంగా వుంచడం మంచనో, నిద్రపోవడమే బాగనో తెలియజేసే ప్రచారం మరింత జోరుగా సాగుతోంది. ఇన్ని రోజుల నుంచీ ఏదీ జరగలేదనే విషయాన్ని సాకుగా చూపిస్తూ ఎన్ని రోజులకయినా ఏదీ జరగదనే నిరాశాపూరిత వాతావరణాన్ని సృజించడంలో పాలకులు కొంత మేరకు విజయం సాధించారు.

అయితే అసమానతలతో నిండిన ఏ సమాజంలోనయినా ప్రభుత్వాలకి తాత్కాలిక ఉపశమనాలు ఉంటాయికానీ శాశ్వత పరిష్కారాలు దొరకవ్. ఉన్న స్థితిని రక్షించుకోవాలనే తాపత్రయం పాలకులని పాలితులకి లేని స్థితిని కల్పించాలనే భ్రమల్ని వాగ్దానం చేయిస్తుంది. ప్రజల్లో చైతన్యం రానంతవరకే నాయకుల ప్రమాణాల జీవితకాలం, వారి పదవుల ఆయువు కాలం చెల్లుబాటవుతుంది కానీ రాజ్యాధికారం ప్రజల వశమయినప్పుడు మాత్రమే రాజకీయాల చరిత్ర ముగిసి, ప్రజాస్వామ్యపాలనకి మార్గం సుగమమౌతుంది. అది అనుకున్నంత సులభంగా సాధ్యమయ్యేది కాదు. అందుకు విప్లవ పరిణామ క్రమాన్ని (Evolutionary Revolution Stream) విజయవంతంగా ప్రజాశ్రేణుల భావగమనంలో ఇమడ్చగలగాలి. ఫలితాలని ఆశిస్తూ శ్రమించేవారికంటే ప్రయత్నాలే ప్రదానమని నమ్ముతూ పనిచేసే తరాలు ముందుకు రావాలి.

ముఖ్యంగా దళిత యువకులు, యువతులు అద్దంలో ఆదునికత గురించి దేవులాడుకుంటూ కుర్చోకుండా సమాజ యదార్ధ పరిస్థితి అద్యయనం చేస్తూ లోతైన మార్పు దిశగా కృషి చేయడం అవశరం. దిగువ, మద్యతరగతి యువత నిద్రపోతోన్న దృశ్యాన్ని ఈరోజు మనం స్పష్టంగా చూడొచ్చు. ప్రతీరోజూ పెరిగిపోతున్న నవీనపు చేష్టలు మనిషనేవాడు సంపాదించడం కోసమే సమాజంలో జన్మించినట్లు ప్రచారోద్యమాలు నిర్వహిస్తున్నాయి. నాగరికత నేడు అందరికీ అందుబాటులోకి వచ్చేలా వుండి కూడా కొన్ని మూకలు, కొద్ది ముఠాలు మాత్రమే దాని ఫలితాల్ని అనుభవించాల్సి రావడం వైజ్ఞానిక ద్రోహం. అలాగే పరిపాలన ప్రతీ మనిషి ఆమోదంతోనే జరపగలిగేలాగున్నా కొన్ని రకాల పద్ధతుల్నే అవలంభిస్తూ, చైతన్యమనే దానిని అంటరానిదిగా చిత్రీకరిస్తూ దొంగల్ని ఎన్నుకోవడమే ప్రజాస్వామ్యంగా భావించవలసి రావడం సాంఘిక నేరం.

తనకి లోబడని జ్ఞానాన్ని రాజ్యం గౌరవించిన దాఖలాలు లేవు.

ఈనాటివరకూ పాలకులు నిర్దేశించింది, మేధావులు నిర్ణయించింది మాత్రమే జ్ఞానంగా చూడబడే దౌర్భాగ్య స్థితి ఇంకా మనకుంది. చరిత్రలో జ్ఞానసాధన స్థానాన్ని మొదట మతం తీసుకుంటే, తర్వాత రాజ్యం కూడా దాంతో కలిసింది. మతరాజ్యాల మనుగడ ప్రజానీకంతోను, వారి అమాయక నమ్మకాలతోను లాభసాటి వ్యాపారం చేయడమే. మతాధిపతులు, రాజ్యాధికారుల ఇష్టప్రకారంగానే ఏ విధమైన పరిపాలనైనా జరిగింది తప్ప, వాటికి ఎదురీది బతికి బట్ట కట్టిన సందర్భాలు స్వల్పం. ఈ దేశంలో మతం నుంచి విడిపడి కులనిర్మూలన కొరకు చేసే పోరాటం వేరుగా వుండదు. మతానికి మంగళం పాడకుండా, మతాతీత వ్యవస్థ దిశగా కృషి చేయకుండా కులం రంగు పులుముకున్న వుద్యమాల పరిమార్ధం సంపూర్ణంగా శూన్యమే.

" The great are great only because we are on our knees. let us rise" **- Max Stinner**

## - అస్తిత్వం - అరాజకత్వం

"To revolt is a natural tendency of life. Even a worm turns against the foot that crushes it. In general, the vitality and relative dignity of an animal can be measured by the intensity of its instinct to revolt".

**- Mikhal Bakunin**

**" ఎదురు తిరగడం సహజ జీవన సూత్రం. కాలు కింద నలిగే పురుగు కూడా మరణించే ముందు పాదాన్ని ప్రతిఘటిస్తుంది. సాదారణంగా ఒక జంతువులోని తిరుగుబాటు తత్వమే దాని స్వాభావిక మయిన సహజాత స్థాయినీ, పోరాట పిపాసని ప్రతిబింబించే చేతనత్వాన్ని కొలవడానికి పనికొస్తుంది."**

**- మైకెల్ బకూనిన్**

నిబద్ధతగలిగిన ప్రయత్నానికి ఫలితంతోను, ప్రచారంతోను పనిలేదు. అడపాదడపా ఎదురయిన ఒడిదుడుకులు నిజాయితీగల కృషిని కుదించనూలేవు, కృంగదీయనూ చాలవు. అనుసరించడమే అస్తిత్వానికి మూలమయితే కాల ప్రవాహంలో కొత్త మార్గాలు పట్టుబడి వుండేవే కావు. అనుసంధానించబడడమే అస్తిత్వ చిహ్నమని అనుకుంటే భావ పరిణామంలో నూతన పథాలు పుట్టిపెరగగలిగేవి కావు. ఆరంభం నుండి అంతం వరకూ అన్వేషణకి అతీతంగా మసలిన దారులు లేవు. మొదల్నుంచి తుదివరకూ గమనాన్ని గ్రహించకుండా సాగిన

పవనాలు కానరావు. వునికిలోనున్న వ్యవస్థని మార్చాలనే తపనే మరోప్రపంచాన్ని వుద్భవింపజేయగలదు. ఊరికే కూర్చుని ఊకదంపుడు మూకల్ని తయారుచేయాలనే ఆర్తి, ఆచరణకి దూరమైన అలౌకిక తత్వాల్ని ఆరాధించగలదు.

ఆరాజకత్వం స్పష్టమయిన ఆచరణాత్మక సిద్ధాంతం. అందులో ఏ విధమయిన సందేహాలకూ తావులేదు. చరిత్రంతా కాగడా పెట్టి గాలించినా ' అరాచకత్వం' లా భ్రష్టుపట్టించబడి పదంలోనే జనాన్ని తప్పుదోవ పట్టించిన మరేదీ కనిపించదు. ప్రతీ భాషలోనూ మన దేశంలోనే కాక ఇతరత్రా కూడా అరాజకత్వం పొరపాటు భావనతోటే పిలవబడుతోంది. పేరెన్నికగల మార్క్సిస్టు మేధావులు, కమ్యూనిస్టు పూజారులు కూడా కావాలని అనేక సందర్భాలలో తప్పుడుగ పద ప్రయోగం చేస్తూ చెప్పడు వారసత్వాన్నే తప్పని తద్దినంగా మోస్తున్నట్లు తోస్తుంది. ఎంత చెట్టుకు అంత గాలన్నట్లు జీవితాంతం సైద్ధాంతిక సమస్యలతోను, ఎత్తుగడలతోను, వ్యూహరచనతోను కాలం గడిపేవారికి ఆచరణావాదాలంటే జంకు సహజం.

" అరాజకత్వ అధ్యయన కేంద్రం" పేరుతో అడపాదడపా క్షేత్రస్థాయి పర్యటనలు చేయడమూ, అవకాశమున్నంత మేరకూ, వనరులు అనుకూలించిన వరకూ రచనల్ని ముద్రించడం మాత్రం జరుగుతోంది తప్పా ఇతర సంస్థాగత స్వరూపాలు, కార్యకలాపాలు దీనికి లేవు. ఆడంబర ప్రచార ఆకర్షణలు కూడా లేవు సరికదా దీని ఆధ్వర్యంలో అచ్చు వేసిన ఏ పుస్తకానికీ ఆవిష్కరణ సభలు సైతం జరపలేదు. నేననేక సందర్భాల్లో ప్రస్తావించినట్లు ఇప్పటిదాకా ఈ కేంద్రానికి మిత్రులు, శత్రువులే కాని సభ్యులు లేరు. ఒకరిద్దరు ఆశక్తి చూపినప్పటికీ వార్ని దూరం పెట్టక తప్పలేదు. భావ సారుప్యత సాధ్యమైనపుడే వ్యక్తులు కలసి పనిచేసే అవకాశం వుంటుంది.

అయితే సంపూర్ణ భావసారూప్యం ఏ ఇద్దరు వ్యక్తుల నడుమ సాధ్యం కాదు. మనిషికీ మనిషికి మధ్య అభిప్రాయ తారతమ్యం తప్పనిసరి అయితే, అందులో భావ బాగస్వామ్యంతో మన అంతరిక అభిప్రాయాన్ని అనుసంధానించుకుందుకు అవకాశం గల వ్యక్తులతో కలసి పయనించ ప్రయత్నించడమే ఏ ఉద్యమానికయినా సంస్థాగత సూత్రం. అలాకాక వ్యక్తిగత స్వార్ధాలకి ప్రాముఖ్యతనిచ్చి, పాచి భావాల పుంగవుల్ని గ్రహిస్తే, ఎంతటి ప్రగతిదాయిక గమనానికయినా గ్రహపాటు తప్పదు. అందుకే 2010వ సంవత్సరం నుండి ఏకోన్ముఖంగానే (One Man Army)

అనేక దార్శనిక రచనల్ని ప్రచురించడం జరుగుతోంది.

గత దశాబ్ద కాలంగా ప్రత్యక్షంగా, పరోక్షంగా చేతనైనంత చైతన్యాన్ని సమాజంలో పాదుకొల్పాలనే ప్రయత్నమే ప్రధానంగా నా రచనా క్రమం సాగుతోంది. అక్షరాల ముఖ్యోద్దేశం కూడా అదే. ఎందుకంటే, వ్యవస్థ పై వికారవాదాల ప్రబావం చాలా బలంగా వుంది. ఇక కులమత పిచ్చను గురించి ప్రత్యేకంగా ప్రస్తావించనక్కరలేదు. వాటిని వీలయినంతవరకు పలుచపరచడమే విప్లవకారుల నిర్మాణాత్మక విధి. కర్తవ్యాన్ని విస్మరించిన విప్లవాశయాలన్నీ వుత్త వూసులుగానో, వికృత ఆశలుగానో మిగులుతాయే తప్ప వైప్లవావిష్కరణను ప్రతిబింబించలేవు. వైప్లవ మార్గాన్ని నిర్దేశించుకున్న వ్యక్తిత్వాలే విధానపరమయిన నిర్ణయావిష్కరణలకి వెనుకంజ వేయకుండా ముందుకు రాగలవు. సార్వత్రిక సౌరభాన్ని సముపార్జించుకున్న సమిష్టి తత్వాలే సామూహిక సామరస్యానికి సంయుక్తంగా పాటుపడగలవు.

కులాన్ని, మతాన్ని సమర్థిస్తూ మనసులో ఎదోమూల 'మనవాళ్ళనే' కుతిని పెంచుకుంటూ ఆంతరికంగానే అశుద్ధమయిన అభిప్రాయాలు ఏర్పర్చుకోవడానికి తెలీకుం డానే అలవాటుపడుతున్న తరంలో మనమీనాడున్నాం. సంకుచితమైన వ్యక్తిగత దృక్పథాలతోనే ప్రపంచాన్ని వీక్షిస్తూ, మనం చూస్తున్నది, మన కంటికి కనబడుతున్నదే లోకమనే బ్రమలో బతుకుతున్నాం. ఏ దారి సరైనదో నిశ్చయించుకోడానికి మనం ముందుకు రానంతకాలం, అడ్డమయిన అన్ని దారులూ మన కంటికి ఇంపుగానే కనబడతాయి అందుకే " We think too small like the frog at the bottom of the well . He think the sky is the only as big as the top of the well. If he surfaced, he would have an entirely different view " అంటారు మావో.

సామూహిక ఉద్రేకాలకి, ప్రజా ఉద్యమాలకి స్పష్టమయిన వ్యత్యాసం వుంది. అది తెల్చుకోకుండా తేలుకుట్టిన దొంగల్లా దోబూచులాడడం వల్ల వుపయోగం లేదు. మంది ఎక్కువగానున్న ప్రతీ సందర్భంలోనూ ప్రజా వుద్యమంగా తలచే ప్రమాదముంది. ముఖ్యంగా తిండిపెట్టో, సొమ్ములిచ్చో జనాన్ని తరలించడం మొదలుపెట్టిన దగ్గర్నించి ఏ సభను నమ్మాలో, ఏ సమావేశాన్ని సమ్మతించాలో తేల్చకోలేని సందిగ్ధావస్థ వుంటోంది. నోటుకో, నిబ్బుకో తమని తాము అమ్మి వేసుకునే వారి అమాయకపు మనస్తత్వాన్ని ఏదో మేరకు అందిపుచ్చుకోగలగడం మన

నాయకులకు నేర్పనక్కరలేదు. ఇన్ని సంవత్సరాల్నుంచీ తమని తాము ఎక్కువ ధరకు అమ్ముకోవడమే రాజకీయమనే స్థితిలో ఈదేశ ప్రజలు ఉన్నారు.

అద్భుతాలు సాధించిన సమాజాలన్నీ ఆకాశంలోంచి వూడిపడలేదు. ఆ సమాజాల్లో జీవించిన ప్రజల సమిష్టి కృషితోటే మానవ చరిత్రకి దిశానిర్దేశం చేసిన ఎంతటి మార్పయినా అనివార్యమైంది. ఆ ప్రజల్ని భావ సంపదతో బలిదానానికి కూడా సిద్ధపడే యోధులుగా తీర్చిదిద్దిన ఘనత ఆయా కాలాల్లో జీవించిన కాకలుతీరిన సాంఘిక కార్యకర్తలకే దక్కుతుంది. ఒక నిర్ధిష్టమయిన నిర్మాణాత్మక కార్యాచరణకు కట్టుబడి, వ్యక్తిగత జీవితాన్ని కూడా పణంగాపెట్టి అహోరాత్రులూ అలుపెరుగని అవిశ్రాంత కృషితో తమని తాము సమాజానికి అంకితం చేసుకున్న జీవితాల్నుంచి, ఈ తరమూ, రాబోయే ప్రతీ తరమూ గుణపాఠాలు నేర్చుకోక తప్పదు.

ఒక దగ్గరి మిత్రుడు ఈ మధ్యనే పెళ్ళి చేసుకునేందుకుగాను వినూత్నంగా శుభలేఖ రాయమని కోరాడు. అలాంటివి నావల్ల కాదని ఎంత చెప్పినా వినక రాయాల్సిందేనంటూ పట్టుపట్టాడు. సరే కానిమ్మని 'మానవ జాతి చరిత్రలో వివాహమనేదొక విప్లవమంటూ' మొదలుపెట్టి, రాసిచ్చాను. చివరికంటా చదివి బాగుందని తేల్చి మళ్ళీ వస్తాననీ, ఏవో కొద్దిపాటి మార్పులు సూచించి చక్కాపోయాడు. ఈ లోపుగా ఒక ఇంటర్వ్యూ నిమిత్తమై వంగదేశం వెళ్ళొచ్చిన నాకు అప్పటికే అచ్చేయడానికిగాను శుభలేఖలు ఇచ్చేసినట్టు తెలిసి విషయమడిగితే అందరి బలవంతంతో సంప్రదాయబద్ధంగానే డబ్బా వాయించక తప్పలేదని సెలవిచ్చాడు. ఈ ప్రస్తావన దేనికంటే, వ్యవస్థ నుంచి వేరుపడడం సులువు కాదని తెల్పడానికే. ఎల్లప్పుడూ ఏదో చేద్దామనుకునే వారికి చివరివరకూ చేయ్యాలనుకునీ ఆఖరికేమీ చేయలేకపోయామని చింతించడం తప్పదు.

ఏం చేయాలో తెలీయని సందిగ్ధత ఏదో చేసే కుతిని ప్రేరేపిస్తే, ఏదోటి చేయాలనే తృష్ణ ఏమీ చేయలేని అస్పష్టతకి అంకురార్పణ చేస్తుంది. చాలా సంవత్సరాల్నుంచి సమాజంలో భాగమైన అహేతుకమయిన పిచ్చి అనుస్యూతాల్ని రాత్రికి రాత్రే అంతం చేయడమనేది సంభవం కాదు. మూఢత్వం పెంపొందినంత బలంగా జనశ్రేణుల్లో హేతుత్వం పెంపొందదు . మనం పాటిస్తున్న పైత్యపు పనుల్ని తప్పకుండా తర్వాతి తరాలకు అందించడం అలవాటుగా మారిన యుగంలో మనమున్నాం. గుడ్డిగా అనుసరించడమే ఆధునికత అంటూ అవశరం లేని అజమాయిషీలకి, అధికారాలకి అంతరాత్మని తాకట్టు పెట్టడానికే పూనుకుంటున్నాం నివసించడమే కాని జీవించడమనేది తెలీని మనం.

విశ్వవిఖ్యాత కళాకారుడు చార్లీ చాప్లిన్ వాక్యాల్ని ఇక్కడ ఉంచడం అప్రస్తుతం కాదనుకుంటున్నాను.

" The way of life can be free and beautiful. But we have left the way. Greed has poisoned men's souls - has barricaded the world with hate; has goose - stepped us into misery and bloodshed. We have developed speed but we have shut our selves in: machinery that gives abundence has left us in want.

Our Knowledge has made us cynical, our cleverness hard and unkind. We think too much and feel too little; More than machinery we need humanity more than cleverness we need kindness and gentleness. Without these qualities life will be violent and all will be lost.

**- Charles Chaplin**

## అభ్యుదయం - అరాజకత్వం - 1

"The tragedy of modern war is that the young man die fighting each other, instead of ther real enemies back home in the capitals."

**- Edward Abbey**

**" ఆధునిక యుద్ధపు బాధాకర విషయమేంటంటే రాజదాని నగరాల్లో ఉన్న తమ నిజ శత్రువులని వదిలిపెట్టి యువసైనికులు ఒకళ్ళనొకరు చంపుకోవడం"**

**- ఎడవర్డ్ అబ్బే**

ఈ రోజు వామపక్ష తీవ్రవాదం గురించిన చర్చ చాలా విస్తృతంగా జరుగుతోంది. ప్రపంచవ్యాప్తంగా అనేక దేశాలు ఈ సమస్యని ఎదుర్కొటున్నాయి. శాంతి భద్రతల సమస్యగా దీన్ని గుర్తించడానికి ముందుకొచ్చి కోట్ల రూపాయల నిధులు కేటాయించి ప్రజల సొమ్ము దోచే ప్రభుత్వాలకి దీన్ని సామాజిక - ఆర్థిక సమస్యగా గుర్తించడం తెలీక కాదు. సాంఘికార్థంలో చేర్చడం వల్ల అనేక ప్రశ్నలకి జవాబు చెప్పవలసి వస్తుంది. ప్రభుత్వాల చాతకానితనం, సంవత్సరాల దోపిడి బయటపడి అన్నిటికీ చరమగీతం పాడల్సొస్తుంది. అదే శాంతి - భద్రత పేరుతో ఎన్ని సిగ్గుమాలిన పనులు చేసినా చెల్లిపోతుందనే ఈ సమస్యకి అసాంఘిక సమస్యంటూ రంగులద్దే ప్రయత్నం చేస్తోంది. తాను చేసే ప్రతీ తప్పుడు పనిని చట్టబద్ధం చేసే జబ్బు ప్రభుత్వాలకి ఈనాటిది కాదు.

మార్క్సిస్టు తత్వశాస్త్ర ఫలితంగా వివిధ దృక్కోణాల్ని, నూతన విధానాల్ని దార్శనిక దృష్టితో చూడడం జరుగుతోంది. మార్క్సిజానికి ముందూ, తర్వాత కూడా అనేక కొత్త దృక్పదాలు తలెత్తినా మరే సిద్ధాంతం చూపించని విధంగా మార్క్సిజం తత్వశాస్త్రం మొదలుకుని పెక్కువాదాల్ని ప్రభావితం చేసింది. మనిషి కోసం తపించే ప్రతీ వ్యక్తీ మార్క్సిజాన్ని తాకకుండా ముందుకెళ్ళలేని పరిస్థితి మార్క్సిజం కల్పించింది. అందుకేనేమో, మార్క్సిజం మేదావుల పాలిటి మత్తుమందు ( Marxism is the opium of intellectuals) అంటాడొక వేత్త. ఏది ఏమైనా దోపిడి వున్నంత కాలం మార్క్సిజానికి, రాజ్యం వున్నంతకాలం అనార్కిజానికి చావులేదు.

మార్క్సిజాన్ని దోపిడికి పరిమితం చేయడానికి కారణముంది. ఎంతటి వ్యక్తులచేత ప్రతిపాదించబడిన విషయాలైనా వారి జీవితకాలంలోనే పొరపాటుగా అర్ధం చేసుకోబడినాయి. అందుకే " Any man who afflicts the human race with ideas must be prepared to see them misunderstood" అంటాడు హెన్రీలూయిస్ మెన్‌కెన్. మార్క్సిజం కూడా అందుకు మినహాయింపు కాదు. ముఖ్యంగా మనదేశంలో మార్క్సిజం మహాభారతంలాగానూ, రాయిజం రామాయణంగాను చెల్లుబాటవుతున్నాయి. సొంత ముద్రలు గుద్దుకున్న ప్రబుద్ధులంతా తోచిన రీతిలో సిద్ధాంత సర్కస్ చేస్తున్నారు. రాయ్‌ని రావణుడి సైన్యంలా రాడికల్ హ్యూమనిస్టులు పూజిస్తుంటే, మార్క్సుని మైరావణుడిగా మార్క్సిస్టులు ఆరాదిస్తున్నారు.

మానవవాదం పేరుతో మాయావాదాన్ని వల్లించిన రాడికల్ హ్యూమనిజం నవ్యమానవవాదమంటూనే నయవంచక తర్క సూత్రాల్ని ప్రతిపాదించింది.వ్యక్తి శ్రేయస్సే లక్ష్యంగా జనించిన వాదాలన్ని సమాజ కళ్యాణం కోసమే చెప్పిన రాయిజమంత రాలుగాయి డప్పును అవి కొట్టుకోలేదు. మొత్తం రాయిజమంత చూసినా అందులో పదాల డాంబికమంతలా నిజాల విశ్లేషణ లేదు. రాయ్ ఒలకబోసిన రసికత్వం తత్వశాస్త్రరీత్యా కొత్తదేం కాదు. అసలు మానవ వాదమనే ముద్రను రాయ్ ఆశ్రయించాలని అనుకోవడానికి చాలా చరిత్ర వుంది. కమ్యూనిస్టు కుట్ర కేసులో అరెస్టయి బయటకొచ్చిన రాయ్ కాంగ్రెస్‌లో ఇమడలేక రాడికల్ డెమోక్రటిక్ పార్టీని స్థాపించాడు.

అయితే అప్పటికే భారతదేశంలో ఇతర రాజకీయ పార్టీలు పుంజుకుంటున్నాయి. ఏ పార్టీకా పార్టీ సొంత విదానాల్ని వైవిధ్యంగా ప్రజల్లోకి తీసుకెళ్ళాలనే చూస్తోంది. అప్పటికే అపూర్వమైన రాజకీయ నేపథ్యం కలిగిన రాయ్ తన అనుభవాన్ని ప్రాతిపదికగా తీసుకుని స్వదేశంలో బలమయిన ప్రత్యామ్నాయ

నిర్మాణానికి నడుంకట్టాలని తలచి సొంత గడ్డపై నక్కజిత్తులకి విస్మయం పొందాడు. కరడగట్టిన కమ్యూనిస్టు కలహాల్ని, పంథాల్ని కూడా ఒంటిగా వోర్చుకుని నెగ్గుకురాగలిడిన రాయ్‌ని ఇక్కడి తక్కెడ రాజకీయాలు నివ్వెరపరిచాయి. అప్పటివరకూ ఈ దేశ రాజకీయాల గురించిన రాయ్ అభిప్రాయాలన్నీ తలకిందులయ్యాయి. రాజకీయాలంటే రాయకున్న దృష్టి వేరు.

కుటిల వన్నాగాలు మాత్రమే రాజకీయంగా, ప్రజాస్వామ్యంగా అమలవుతోన్న కాలమది. అటువంటి ఒరవడికి శ్రీకారం చుట్టిన మహానాయకులందరి ఎత్తుల ముందు రాయ్ విజ్ఞత మౌనం వహించక తప్పలేదు. కళ్ళముందే దేశాన్ని దోచుకుతింటున్నా ఏమీ చేయలేని నిస్సహాయ స్థితి రాయ్‌ది. ఒక రకంగా అన్ని దారులూ మూసుకుపోయిన ఏకాకి పరిస్థితి అది. ఎవరో కొద్ది మంది మినహా రాయ్‌ని నమ్మినవారు లేరు. కొత్తవారి మాటలా వుంచి వున్నవాళ్ళు కూడా జారిపోయే పరిస్థితి. అప్పటిదాకా ఎలాగోలా కష్టపడి కాపాడుకుంటూ వచ్చిన ఆ కాస్త విప్లవ ఢాంబికం ఆవిరయ్యే సమయంలో తన వారసత్వాన్ని నిలుపుకోవడానికే రాడికల్ హ్యూమనిజమనే రోగాన్ని ప్రతిపాదించాడు. తర్కాన్ని ఒంటబట్టించుకున్న రాయ్ సిగ్గుబిళ్ళ సిద్ధాంతానికి సత్యమంటూ సింగారం రంగులద్దాడు.

అప్పటికే అరిగిపోయిన వాదాన్ని నెత్తికెత్తుకుని రెండు ప్రయోజనాలు సాధించాడు. మార్క్సిస్టు పోకడలకి అంత స్థాయిలో ప్రత్యామ్నాయం చూపించాలనుకునీ చావు తప్పి కన్నులొట్టపోయిన గతాన్ని గుణపాఠం చేసుకుని అహాన్ని తృప్తిపరిచే యత్నం ఒకటయితే, ఇక సత్యం, స్వేచ్ఛ, మనిషి మొదలైన పదాలపై మానవాతీత స్థాయిలో మంకుపట్టు పట్టడం. ఒక్కదెబ్బకి రెండు పిట్టలన్నమాట. సత్యమో సత్యమంటూ సందడి చేసిన సిద్ధాంతాలన్నీ జెండా ఎత్తేయడం కోసమే జన్మిస్తుంటాయి. వాటి వైఫల్యానికి వల్లించడమే చిహ్నమయితే, సాగదీయడంతోనే వాటికి సార్థకత చేకూరుతుంది. రాయిజం కూడా అలాటి రథోత్సవ వేడుకకి ప్రతీకే. కమ్యూనిజం ఎలా అప్రజాస్వామికమో చెబుతూ బెట్రాండ్ రస్సెల్ వాక్కుల్ని పరిశీలించడం ప్రస్తుతించదగ్గది. " Communism is not democratic. what it calls the dictatorship of the proletariat is in fact the dictatorship of a small minority, who become an oligarchic governing class. All history shows that government is always conducted in the interests of the governing class, except in so far it is influenced

by fear of losing its power. this is the teaching, not only of history, but of Marx. The governing class in a communist state has even more power than the capitalist class in a democratic state. so long as it retains the loyality of the armed forces, it can use its power to obtain for itself advantage quite of harmful as these of capitalists. To suppose that it will always acts for the general good it were foolish idealism, and is contrary to Marxian political psychology, Communism restricts liberty, particularly intellectual liberty, more than any other system execpt facism. The complete unification of both economic and political power produces a terrifying engine of oppression, in which there are no loopholes for exceptions. Under such a system progress would soon become impossible, since it is the nature of bureau crates to object to all changes execpt increase in their own power. All serious innovation is only rendered possible by some accident enabling unpopular persons to survive. kepler lived by astrology, Darwin by inherited wealthy, Marx by engels 'exploitation' of the proletariat of Manchester. Such oppurtunities of surviving inspite of unpopularity would be impossible under communism" ముందే చెప్పినట్లు మార్క్సిజమెహ మోహామయితే, రాయిజమొక రోగం. ఆచరణాత్మకంగా అలవికాని మాటలు వల్లించిన ప్రతీ సొట్టవాదమూ, అష్టవంకరులు తిరిగి ఆఖరికి అతుకులబొంతగా చతికిలబడడానికి వాటి విషయంలో వ్యవహరించిన వ్యక్తుల తీరు కూడా ఒక ముఖ్యకారణం. కాగితాలు నింపడానికీ, కార్యశీలత చూపడానికి వ్యత్యాసముంది. కొద్దోగొప్పో ప్రజలతో సంబంధం లేకుండా ఉరకనే ఊసుపోక కబుర్లు కెలకడం కొత్తకోకకోసం సరదాగా సమర్తాడం లాంటిది. విభిన్నత అధికంగా చూపాలనే వింత మనస్తత్వం విపరీత బుద్ధికి దారితీస్తుంది. వినాశకాలే విపరీత బుద్ధన్నారుగా పెద్దలు. మానసిక సమతుల్యత లోపించిన వైకల్యాల్ని మహామేధస్సుగా పరగణించే దేశం మనది. అరువుని పక్కకు నెట్టి అసలు చిత్తాన్ని ఆశ్రయించడమే అందుకు విరుగుడు.

" Society has good reason to fear the radical. Every shaking advance of mankind toward equality and justice has come from the radical. He hits, he hurts, he is dangerous ..." - **Saul Alinsky**

# అభ్యుదయం - అరాజకత్వం - 2

" The most common way people give up their power is by thinking they don't have any" -**Alice Walker**

**" సర్వ సాధారణంగా ప్రజలు తమ శక్తిని నిర్వీర్యం చేసే మార్గమేమిటంటే, తమని తాము అశక్తులుగా భావించడమే" -ఎలన్ వాకర్.**

" ప్రపంచం ఒక యుద్ధభూమి. ఈ రణరంగంలో అవకాశాన్ని గుర్తెరిగి సదుపయోగం చేసుకునే వీరసేనాపతినే విజయం వరిస్తుంది. సరియైన అవకాశాల్లో అతడు ఎంత ఉత్సాహంగా ముందుకు సాగితే, అంతగా ఆపదలు వెనక్కి వెళ్ళిపోతాయి. అటువంటి వీరపురుషుడు దేశ నిర్మాతగా వెలుగొందుతాడు. చరిత్ర అతని పేరు ప్రతిష్టలపై యశస్సుమాల్ని వర్షిస్తుంది. ఈ యుద్ధభూమిలో ఒక్కొక్కప్పుడు సందర్భాన్ని గమనించే వీరసైనికులయితే వస్తారుకానీ వాళ్ళకు ఆపత్సమయాల్లో వెనక్కు తగ్గడం అంటే ఏమిటో బొత్తిగా తెలియదు. ఆ వీర పురుషులు యుద్ధనీతికి విజయాన్ని బలిచేస్తారు. తమ సైన్యం అంతా నాశనమయినా ఇష్టమే కాని, ఒక్కసారి అడుగుపెట్టిన చోట నుంచి ఒక్క అంగుళమైనా సరే వెనుకకు రానేరారు. అటువంటి వాళ్ళు విశ్వక్షేత్రంలో విజయం సాధించడం కల్ల. కానైతే వాళ్ళ ఓటమి గెలుపుకంటే కూడా గౌరవం చేకూర్చేదిగా ఉంటుందంటాడు" ప్రేమ్‌చంద్.

మంచని మనం తలచాలని వ్యవస్థ ఆశించే అభ్యుదయానికి సమాజంలో కరువులేదు. 'అభ్యుదయం అంటే ఇదీ' అని స్పష్టంగా చెప్పలేని పరిస్థితి అభ్యుదయం అన్న పదాన్ని ఏదో ఒరగబెట్టే ధోరణిలో ముందు నిలబెట్టింది. ఏనాటినుంచో మనకి తనకుమాలిన అభ్యుదయవాదులు తామరతుంపరగా తయారయినారు. వాదాలతోను, వాస్తవాలతోను పనిలేకుండా సిద్ధాంతపు కోవ ఏదైనా అభ్యుదయం తోవతొక్కడం పరిపాటయిపోయింది. అందుకే మనకి అసలు విధానాలు, ఆచరణాత్మక ప్రయత్నాల కంటే కూడా అభ్యుదయ చర్చలు, ప్రగతికర రచ్చలే అధికం. కళ్ళ ముందు జరిగే అన్యాయాన్ని ఆపే ప్రయత్నం చేయలేని అసహాయత్వానికి, పిరికితనానికి అభ్యుదయని పేరుపెట్టుకు సంబరపడే ఆనందం ఆచారంగా అమలవుతున్న వ్యవస్థమనది. నిజంగా వ్యవస్థ గురించి తపించే వ్యక్తులు ఏనాటికైనా తమ వెనకనుండేది వెన్నెముక మాత్రమే అని గ్రహించి రంగంలోకి దిగితే మంచిది.

సమాజ సేవనేది ప్రహసనంగా మారి చాలాకాలమైంది. ఇదే విషయమై "స్వచ్ఛంధ సేవా పూనకం" పేరుతో ఒక కరపత్రాన్ని, ఈ స్వచ్ఛంద సేవా సంస్థల

నిర్వాకాన్ని దుయ్యబడుతూ "సాంఘిక తత్వం -వైప్లవ మార్గం"అనే పొత్తాన్ని రాయడం జరిగింది. సంబందిత విషయంపై మరింత సమాచారం కావాల్సినవారు వాట్ని కూడా చదవడం ఉపయుక్తమని నా భావం. కొత్తగా మొలకెత్తిన కుతిని ఆచారం చేసుకుని ప్రతీ కోన్కిస్కా కోలాటంగాడూ సాంఘిక సేవాతత్వమంటూ వంకర తత్వాలకి వంతపాడడం రివాజయిపోయింది. అసలు సమాజమంటే ఏమిటో, దాని స్వభావమేమిటో, గమన విదానమెట్టిదో కూడా తెలీని గొట్టం గాళ్ళందరూ స్వచ్ఛంద పైత్యాల్ని ప్రదర్శించుకోడానికి సొంత సంస్థల్ని కూడా స్థాపించిన సందర్భాలు కోకొల్లలు.

బృందావనాలు, గంధర్వగానాలు, పుష్పక విమానాలు.. మొదలైన వాట్ని బుర్రలో ఎక్కించుకుని తలచెడిన ఆధ్యాత్మిక ఆవేశపరులు భక్తి పేరుతో సమాజస్థితిని గుర్తించి ఏదోమేరకు పాటుపడడం మంచిదే కాని వారి కార్యాచరణ ఫలితం ప్రజల్ని మరింత మూఢులుగానో, అనాలోచనాపరులుగానో చేసేదిగా వుంటే మట్టుకు ప్రమాదం. మూర్ఖత్వాన్ని పెంపొందించేందుకు చేసే రాజ్యపు దూర్త ప్రయత్నాల్లో మానవసేవ మాధవసేవనే దృక్పదం ముందుంటుంది. జాతీయ ప్రజా ఐక్య ఉద్యమ వేదిక (National Alliance For people movements) రాష్ట్ర కార్యశీల నాయకురాలు ఇదే రకమైన అభిప్రాయం వెలిబుచ్చింది. అందుకు నేను, కలసి పనిచేసే సందర్భాల్లో పరస్పర గౌరవనీయ వైఖర్ని అవలంబించగలను కానీ సమూల మార్పు వాదిగా(Radical) ఉండడానికి నా కారణాలు నాకున్నాయని రాసాను.

చెప్పుకోదగ్గ వుద్యమ నేపద్యంగల కార్యకర్తలు సైతం ఏదో విధంగా ప్రజల్లో మమేకమవడమే లక్ష్యంగా పనిచేయడం ఆహ్వానించదగినదే కాని, ఈసరికే వారనుసరిస్తున్న బానిస విధానాల్ని సమర్ధించేలా ప్రవర్తించడం సరైనది కాదేమో. అంతిమంగా ప్రజాహితానికే ప్రాముఖ్యతనిచ్చే మనం వారికెక్కడ దూరమవ్వలసి వస్తుందనే ఆదుర్దాతో అంతరాత్మకి విరుద్ధంగా నడవడం కూడా క్రమంగా మార్చుకోవలసిన అవశరముంది. గణనీయమైన జనసమూహాలు మన జ్ఞానాన్ని గట్టెక్కకుండా పరిమితం చేసే సాధనాలు. ఎంతటి ప్రజా కదలికయినా, అది మరో ఉన్నత యత్నానికి ప్రజల్ని కదిలించేదిగా మొదలవ్వాలి తప్ప ఉన్న సమస్యని మాత్రమే పరిష్కరించుకునే దిశగా దృష్టి సారించడం వలన విశ్వజనీనత లోపిస్తుంది. సార్వత్రిక ఉద్యమాలకి, సందుగొందుల ఉద్యమాలకి అదే ప్రదాన వ్యత్యాసం.

ప్రపంచంలోని జనమందరూ ఏదోరూపంలో ఎదుర్కొంటున్న అనేక సమస్యల ఉనికికి సందర్భానుసారం ప్రాదేశికతని కలపడం వల్ల సార్వజనీనత

దెబ్బతింటుంది. అలాటి క్లిష్ట సమయాలలోనే సామాజిక కార్యకర్తల విధి నిర్వహణ అత్యంత ప్రాదాన్యత సంతరించుకుటుంది. ఎందుకంటే, ఏ ఉద్యమాన్నైనా కుదిరినంత కుదించడానికే రాజ్యం చూస్తుంది. ప్రజా శ్రేణుల్లో భావవిస్తరణకి భయపడి చైతన్యపూరిత ఆలోచనల ప్రాబల్యం ప్రబలకుండా చేయవలసిన సర్వ ప్రయత్నాలూ చేస్తుంది. అందుకు విరుద్ధంగా ప్రతీ సాంఘిక కార్యకర్తా కూడా జరుగుతోన్న కార్యక్రమాల ఉద్దేశాలనీ, లక్ష్యాలనీ విశ్లేషనాత్మకంగా జనాల్లోకి తీసుకెళ్ళే ప్రయత్నం నిరంతరం చేస్తుండాలి. ఉద్యమాలతో తోడులేకుండా ఈ చైతన్యోద్యమం నిరంతరం జరగాలి. కనీస నిర్ధిష్టస్థితికి వ్యవస్థ చేరుకునేవరకూ ఎన్నిరకాల నియంత్రణలనూ, అన్ని రకాల నియంతృత్వాలను ఎదుర్కొనేదిగదా ఒక నిజమయిన కృషి జరగాలి.

విజయమనేది గమనంలో భాగమేకాని పరమావధి కాదని గుర్తించడం మన ప్రాధమిక కర్తవ్యం. ఆచరణని నమ్ముకున్న వ్యక్తిత్వాలకి ఫలితాలతో సంబంధం లేదు. మన విచక్షణ అనుకూలించినమేరకు అన్నివిధాలయిన ప్రజా కదలికలకు సశాస్త్రీయమైనటువంటి సాంఘిక రక్షణ కల్పించడమే మన కార్యక్రమాల ముఖ్యోద్దేశం. అందులో భాగంగానే ప్రస్తుతం జబ్బలు చరుస్తున్న ఊకదంపుడు ఉద్యమాలకి భిన్నమయిన ప్రగతిశీల భాగస్వామ్య భావవిప్లవ వేదికని నిర్మించుకోవలసిన అవశరం ఎంతైనా వుంది. సాంఘిక జీవన క్రమంలో మార్పుకోసం తపించే ప్రతీ వ్యక్తీ, ప్రతీ సంస్థా మౌలికమైన భావచైతన్యం గురించి సైద్ధాంతిక వైధానిక పద్ధతుల్ని సరళీకృతం చేయడమే ఈ నాటి సరళీకృత ఆర్థిక విదానాలు, ప్రపంచీకరణని ఎదిరించేందుకు సరిపోయే సాధనాలు.

తమ పరిపాలనకు అనుగుణమయిన మనస్తత్వాన్ని ప్రజల్లో పెంపొందించడం ప్రభుత్వాల ఉనికికి ప్రాధమిక సూత్రం. తమ పరిపాలనను ప్రశ్నించే జవసత్వాల్ని అణిచేయడం ప్రభుత్వాల రెండో సూత్రం. తమ పరిపాలనని విసిగించే ఉద్యమాల అస్తిత్వాన్ని అంతమొందించ చూడడం ప్రభుత్వాల మూడో సూత్రం. అందుకే, పరిపాలన పరిధిని దాటి ఎవరయినా ఆలోచించడం తన అస్తిత్వానికి అవమానకరమనీ, తన ఉనికికి ప్రమాదకరమని ప్రభుత్వాల నిశ్చితాభిప్రాయం. తనకు విరుద్ధంగా ప్రతిపాదించిన నిజాలు ప్రజలవరకూ వెళ్ళకుండా, తనని తప్పా ప్రజలు మరిదేన్ని గ్రహించకుండా చేయడానికిగాను వారికి అవశరమైనదాని కంటే అదనపు చైతన్యాన్ని అందజేసి, జీవితాంతం గందరగోళంలోనే గడిపేసే ఏర్పాటు చేస్తోంది.

తనని కాదనే తత్వమంతా చెడ్డదేననే స్వభావం ప్రభుత్వానిది. పరిపాలనా కాంక్షనే అభివృద్ధి ఆపేక్షగా భ్రమిస్తోన్న అజ్ఞానం దానిది. నిరంతరం నిజజీవిత కష్టాల్ని ఎదురుకునే జన సమూహాలకి అప్పుడప్పుడు అర్ధసత్యాల్ని వినిపించడమూ, అభ్యుదయ పలుకుల్ని వల్లించడమే ప్రదానంగా అనిర్దిష్టమయిన జీవన విదానాల్ని ప్రోత్సహిస్తోంది. యదార్ధ జీవన దృశ్యాలకి విరుద్ధమయిన సృజనాత్మక అభిప్రాయాల్ని సృజించుకోవడమే వివేకానికి పరాకాష్టగా ఎంచబడుతోంది. మన అవ్యక్తమయిన పరాధీనతని రక్షించుకోవడం కోసం నిద్రిస్తోన్న వ్యవస్థ పై నిందలు వేయడానికి అలవాటుపడిన మనం, నిర్లిప్తంగా వుండడానికి గాను కొత్త సంజాయిషీ కారణాల్ని సృష్టించడానికి చూపే ఆసక్తిలో సగమైనా సమాజ వాస్తవికతని లోతుగా పరిశీలించడంలో చూపుంటే వ్యక్తిగతంగానయినా మనం ఏర్పర్చుకోబోయే అభిప్రాయాలకి ఒక నిర్దష్టకత చేకూరుండేది.

వీలైనంత అందంగా, ఆనందంగా గడిపేయడమే మనిషి జీవితానికి ముఖ్యమనే ఒక మార్మికమైన విధానాన్ని ప్రేరేపిస్తూ, సుఖాన్ని అన్వేషించడమే సామాజిక విధిగా మరో కోణంలో ఎంచబడుతోంది. ప్రస్తుత వ్యవస్థలో మన వ్యక్తిగత అస్తిత్వాన్ని నిలుపుకోడానకి వాదాలనాశ్రయించే వారు కూడా లేకపోలేదు. దారి తప్పిన మేధ మానవ గమనానికి నష్టం చేస్తుంది. ఒక వ్యక్తిగత ప్రయోజనాన్ని దృష్టిలో పెట్టుకుని పుట్టుకొచ్చిన కొత్తవాదాలు ఏం ప్రతిపాదించినా పెద్దగా ఆశ్చర్యపోనవశరం లేదు. పిచ్చిని సిద్దాంతంగా చెప్పాలనుకుంటే, పిచ్చనేది మానవ జాతి చరిత్రలో అతి పురాతన సిద్ధాంతమనీ, పైత్యమనేది ప్రగతిదాయక ఆలోచనా విదానానికి ఆలంబననీ, తిక్కే వ్యవస్థని నిర్దేశించే తత్వశాస్త్రమనీ చెప్పి అందుకెన్ని చారిత్రక విషయాలనైనా పరిచయం చెయ్యొచ్చు.

ప్రపంచంలో అత్యధిక అభివృద్ధి చెందిన రాజ్యాలన్నీ పిచ్చితోనే వృద్ధి చెందాయనీ, అసలు లోకంలో ఎక్కువ మంది అంతర్లీనంగా పిచ్చివారేననీ, మనిషి ఒక పిచ్చలో నుంచి మరోపిచ్చలోకి ప్రయాణించడమే జీవితమనీ, మొత్తంగా పిచ్చి చుట్టూనే ప్రపంచం పరిభ్రమిస్తోందనీ, పిచ్చే ప్రకృతి సహజ గుణమనీ, పిచ్చే జ్ఞానమనీ, జ్ఞానమే పిచ్చనీ... పిచ్చివాడికి ప్రపంచమంతా పిచ్చగానే కనబడినట్లు, భిన్న సైద్ధాంతిక రుగ్మతల్ని ఒంటినిండా పట్టించుకున్న అల్పులకి కూడా లోకం తమ పైత్యానుసారం నడుస్తున్నట్టే తోస్తుంది. ఏది ఏమయినా, నిజాలని గుర్తించడానికి మనకి అవశరమయిన ఐహిక జ్ఞానం అందనంతకరకూ ఆకర్షణీయమయిన అవాస్తవాలే మన అలౌకిక ఆశల్ని అదుపు చేస్తుంటాయి.

" The Most dangerous man, to any government, is the man who is able to think things out for himself without regard to the

prevailing superstitions and taboos. Almost inevitably he comes to the conclusion that the government he lives under is dishonest, insane and intolerable, and so, if he is romantic, he tries to change it. And even if he is apt to spread discontent among those who are."

**- H.L. Mencken**

## ఆశయతత్వం - అరాజకత్వం

"A good world needs knowledge, kindliness and courage... it needs a fearless outlook and a free intelligence. It needs hope for the future, not looking back all the time towards a past that it dead, which we trust will be for surpassed by the future that our intelligence can create."

**- Betrand Rusell,** God and Religion

" ఒక ఉత్తమమయిన ప్రపంచానికి జ్ఞానము, జ్వలనము, ధైర్యము అవశరం... అందుకు నిర్భయమయిన దృక్పధమూ, స్వతంత్ర మేధస్సూ కావాలి. భవిష్యత్తును గురించిన అచంచలమయిన విశ్వాసంతో, మరణంచిన గతాన్ని మాటిమాటికీ వెనక్కి తిరిగి చూడకుండా, మన నమ్మకాల్ని సైతం ముందుకు నడిపిస్తూ, రాబోయే రోజుల్ని తన అద్వితీయమయిన విజ్ఞానంతో ఆశాజనకంగా మలిచేదిగా ఉండాలి".

– *బెట్రాండ్ రస్సెల్*, దేవుడూ–మతము

వ్యవస్థ కోసం ఏదో వెలగబెడుతున్నామనే విషయాన్ని ప్రచారం చేసుకుంటూ అంతరికంగా గుర్తింపును ఆశించేవారూ, సంఘం గురించి సర్వం త్యాగం చేసామని అనుకుంటూ అంతర్లీన అధికార కాంక్షని అనుభవించేవారూ, నిజానికి సామాజిక దొంగలు. మనమేదో అందరికీ అతీతమైనది చేస్తున్నామనీ, సర్వ మానవాళిని ఉద్ధరించడం తమ భుజాల పైనే వుందని భావించేవారు కూడా ఇదే తరహా ఇరుకు మనస్తత్వాలకి ప్రతిబింబాలు. ఎందుకంటే, మనం మహాద్భుతమైనదేదీ సృష్టించడం లేదు. మన ముందూ ఇలాటి ప్రయత్నాలు జరిగాయి. మన తర్వాతా జరుగుతాయి. చెప్పాలంటే, మన కంటే మంచి యత్నాలు జరిగాయనీ, మరింత మహోన్నత ప్రయత్నాలు జరిగాలని ఆశించాల్సి వస్తుంది. అలా కాకుండా ప్రపంచం మన కృషిని, శ్రమని, త్యాగాన్ని పట్టించుకోలేదనుకోవడం భూగోళం మన చుట్టూ పరిభ్రమించాలని తలచడం వంటిది.

"ఒక విప్లవకారుడు వసతులు లేనప్పుడు బాధనుకానీ లేదా వసతులు పొందినపుడు వాటిపట్ల ఆకర్షణని కానీ పెంచుకోడంటారు ". భారతదేశ

ప్రత్యామ్నాయ కమ్యూనిస్టుపార్టీ అయిన ఎస్.యు.సి.ఐ. నిర్మాణకర్తయిన శిబ్దాస్‌ఘోష్ ఆయనే "త్యాగపూరితమైన ఆదర్శంలో ప్రతిఫలంగా ఏదో ఒకటి పొందాలనే కోరిక అంతర్గతంగా వుంటుంద" ని అంటూ, ఈ దేశ బూటకపు కమ్యూనిస్టు నాయకుల గూర్చి చెబుతూ, " ఈ నాయకులు దేశంలోని విద్యార్ధులందర్నీ విప్లవం కోసం అంకితం కమ్మని పిలుపిస్తుంటారు. వారికి పోరాడండి, జైళ్ళకు వెళ్ళండి, లాఠీ, బుల్లెట్‌లను ఎదుర్కొండి; స్వంత జీవితాలను లెఖ్ఖ చేయకండని చెబుతుంటారు. కానీ తమ సొంత పిల్లలకు మంచి విద్యార్ధులుగా ఉండండి; మొదట మీరు జీవితంలో పై స్థాయికి వెళ్ళండి, జీవితానికి భద్రత నెలకొల్పుకోండి అప్పుడు ఏం చేయాలో మీరు నిర్ణయించుకోవచ్చని చెబుతారు. "అంటారు.

ఆయనన్నట్లుగానే మనకున్న అనేకమంది ధనిక విప్లవకారులు వ్యక్తిగతంగా వీలైనంత సుఖవంతమైన విలాస జీవితం గడుపుతూ అడపాదడపా విప్లవ ఢాంబికాలు పలుకుతుంటారు. మన దేశంలో చాలా మంది విప్లవ నాయకులది ఇదే తరహా. తమ కుటుంబము, తమ పిల్లలు, ఇతర మిత్ర బృందాలమధ్యనున్నప్పుడు కనీసంగానయినా సామాజిక స్పృహలేని ఈ అక్కుపక్షులు, ప్రజల మధ్యకు పోయేటప్పుడు మాత్రం అసలుతామెప్పుడూ వ్యక్తిగత జీవితం గురించికానీ, కుటుంబస్థితి కోసం కాని పట్టించుకోనట్లు నటిస్తుంటారు. ఈ దేశంలో నిజమైన ఆచరణాత్మక అరాజకవాదులెవరంటే అట్టడుగుస్థాయి ప్రజలే. ఎందుకంటే సొంత ఆస్తనే పదం వారికి సరిపడదు. ఉన్నంతలో బ్రతకడం తప్ప మరొకరి కోసం నటించడం వారికి రాదు. అయితే ప్రపంచీకరణ ప్రభావం ఇప్పడిప్పుడే వారి పై కూడా పడుతోంది.

వాస్తవంలో మనకి అందని విలాసవంతమయిన సౌకర్యాల్ని ఆసాంతం అనుభవించడానికి మనం అలవాటు పడ్డామని ప్రపంచానికి చూపించడాన్నే ఫ్యాషన్‌గా, మోడ్రన్‌గా పిల్చుకుంటూ మురిసిపోతున్నాం మనం. పెట్టుబడిదారీ -పెత్తందారీ ప్రజాస్వామ్యపుణ్యమా అని, ఈ రోజు అన్ని విషయాల్లోనూ ఇదే విధంగా ఆలోచిస్తూ మోసపోతున్నాం. ఆహారం అందరికీ అందుబాటులోకి రాలేదనీ, ఆకలి సమస్య అధికమవుతోందని గ్రహించకుండా ఉదయం లేచిందగ్గర్నించి అనేక కొత్తరకాల తిండి పదార్థాలని చూసి తరించే బాగ్యం రాజ్యం కల్పిస్తుంది. విద్య వైద్యం అందుబాటులోకి రాలేదనే ఆలోచనే శుద్ధ అసత్యంలా కళ్ళుచెదిరే ఖరీదైన కార్పొరేట్ స్కూళ్లు, కాలేజీలు, ఆసుపత్రుల్ని ఎల్లప్పుడు మన కళ్ళముందే నిలబెడుతుంది. పేదరికమనే మాట మన నాలుక పొరపాటున ఎక్కడ ఉచ్చరిస్తుందోననే సదుద్దేశంతో తలపైకెత్తి కష్టపడి చూస్తే కాని కనిపించని పెద్దంతస్తుల మేడల్ని చూపిస్తుంది.

కోట్ల రూపాయలు కేటాయించి అత్యాధునికమయిన తారు కుమ్మరించబడిన వెడల్పాటి రహదారులపై రాత్రీ పగలనే తేడా లేకుండా పరిగెడుతుండే వాహనాలు, మూటలు మోసుకుంటూ వచ్చి బుట్టలో సరుకులమ్మే వర్తకుల కడుపుకొట్టి అందంగా సుందరంగా అలంకరించిన అద్దాల్లో అశుద్ధాన్ని కూడా ఆకర్షణీయంగా చూపించే సూపర్ మార్కెట్లు, కాలిగోటి నుంచి కంటిపాప వరకూ పాపం మనం శరీర సౌందర్యం గురించే ఆలోచిస్తూ ఒక్కొక్క అవయవానికిగాను వందల ప్రకృతి రసాయన లేపనాల్ని సృష్టించే సంస్థలూ, మంచినీటి వాడకం మొదలుకుని మరుగుదొడ్డిని తోడుకునే వరకూ నిత్యం సాగుతున్న వ్యాపారాలు, మన మెన్నడూ తినీ తాగి ఎరుగని వింత విచిత్రమయిన రంగుల్లో రుచుల్లో ఆహార పానీయాలు, సరుకులు ,రోజుకో రూపం ధరిస్తున్న సెల్ ఫోన్లూ, అంతకంతకీ చిన్నవవుతున్న కంప్యూటర్లూ, వీటన్నింటినీ కళ్ళారా చూస్తూ జరిగేది అబివృద్ధి కాదని ఎవరైనా అనగలరంటారా?

అసలు అబివృద్ధికి అర్ధం తెలీని నాబోటి బచ్చాగాళ్ళనీ, ప్రతీదాన్నీ అనవశరంగా విమర్శించే విప్లవకారుల్ని, ఉద్యమకారుల్నీ మినహాయిస్తే జరుగుతున్నది అబివృద్ధి మహాయజ్ఞమనీ, అందులో పాలుపంచుకోవడం ప్రజలందరి బాధ్యతనీ సాక్షాత్తూ దైవసమానులయిన పాలకులు చెబుతోన్న మాటల్ని విస్మరించి ఇది అబివృద్ధి కాదనే మూర్ఖులు ఎవరుంటారు. ఇంత చెబుతోన్నా ఢంకా బజాయించి జరుగుతున్నది ప్రభుత్వాల, పారిశ్రామికవేత్తల వృద్ధే కానీ ప్రజాఅబివృద్ధి కాదన్నవార్ని ప్రాణాలతో ఉంచడమూ, ప్రాణాల్తోనేవున్నా వ్యవస్థలో స్వేచ్చగా బతకడమూ మన నాయకులకు సుతరమూ నచ్చదు. ఆర్ధిక సరళీకరణ విదానాల వల్ల పాలకుల ఆర్ధికాబివృద్ధి సాధ్యమయిందేకాని సామాజిక అబివృద్ధి కాదు. అబివృద్ధిని అంకెల్లో కాక బడుగుల బతుకుల్లో చూడగలగాలి.

ఆలస్యంగా పరిచయమయిన మానవ హక్కుల, పౌరహక్కుల ఉద్యమాల్ని కదిలించిన వ్యక్తిత్వాలతో ఏకకాలంలో జీవించినా కూడా వార్ని కలుసుకోకుండా ఎంత స్ఫూర్తిని కోల్పోయానో అర్ధమౌతోంది. తరం హక్కుల ఉద్యమకారులుగా చెప్పగలిగే శంకరన్, కన్నాబిరన్, జయశంకర్ లాగానే తర్వాత తరాల్ని అవిశ్రాంతంగా జాగృతం చేసిన నరేంద్రనాథ్, బాలగోపాల్, బుర్రా రాములు కూడా భౌతికంగా అస్తమించిన కాలంలో సమాజంలో మార్పునాహ్వానిస్తూ ఇప్పడిప్పడే ఉదయిస్తోన్న కలం నాది. మనిషి కోసం అనుక్షణం ఆలోచించే వారి మహోన్నతమయిన వ్యక్తిత్వాలు వెలువరించే అపూర్వమైన స్ఫూర్తిని గ్రహించే ప్రయత్నం నిజాయితీగా చేస్తూ స్వచ్ఛందంగా ముందుకు నడవడం ఈ తరం యువజనుల కనీస బాధ్యత. మన

ముందు తరాల ఆలోచనల్ని ప్రభావితం చేయగలిగిన అసాదారణ వ్యక్తుల ఆలోచనల్ని పట్టించుకోని జ్ఞానం శూన్యం.

మనం జీవించే దైనందిన జీవితాల నుంచి సాధ్యమైనంత దూరం జరగడమే వ్యక్తిగత గౌరవంగా చూడబడే సమాజం అనుక్షణం మనల్ని నిజాలు చూడకండంటూ ప్రబోధ చేస్తుంటుంది. రోజూవారీ ఒత్తిడికి విరామ ప్రమాణంగా ఏదోరకమయిన మత్తు వ్యసనాన్ని ఆశ్రయించక తప్పని స్థితి దాపురిస్తుంది. లాభసాటి వ్యాపార సంబందాలే మానవ జీవితాలలో ప్రదానపాత్ర పోషిస్తాయి. అన్ని ఆత్మీయ అనుబంధాల్లోనూ అంతర్లీనంగా ఆర్థికత తొంగి చూస్తూ, కుటుంబాల్లో కుళ్ళు కుతంత్రాలకీ, స్నేహ సంబంధాలలో వింత వికారాలకి తోవ చూపుతాయి. మనతో స్నేహం అవతలివారికి అవశరమైనంతగా మనకవశరం లేదనే ఒక అహంకార వైఖరి అబివృద్ధయ్యి, మనకవశరమైన సందర్భాలలో మాత్రమే అవతలివారి స్నేహాన్ని ఆశ్రయించడం అలవాటవుతుంది. జీవితంలో అహంకారాన్ని పెంచుకున్నంతలా, దాన్నే ఆత్మగౌరవం అని అనుకున్నంతలా మనుషులపట్ల ఆత్మీయతని మనం పెంచుకోలేదేమోననిపిస్తోంది.

తాము అత్యంత అత్యాధునిక సాంకేతిక విజ్ఞాన యుగానికి ప్రతినిధులం కావున తమ అస్తిత్వానికి సరితూగే సౌకర్యాల్ని కల్పించడం వెనకబడిన సమాజ లోపమనే దృష్టితో ఈ దేశపు పల్లెటూర్లని కార్పొరేట్ కళ్ళతో చూడడానికి అలవాటుపడడం కొత్త తరాలకొక ఆచారంగా తయారయింది. సమాజంలో చాలా మంది కంటే అనేక విదాలుగా తాము ఉన్నతులమని చాటిచెప్పేందుకు చేసే వ్యాయామం ఈరోజు ప్రతిచోట దర్శనమిస్తోంది. "మాకు మానవాతీత మహా జ్ఞానమున్నది. కాబట్టి సాదారణ విషయాల గురించి మాకేమీ తెలీదు. మేమంతా నాగరిక నవ వానరులం కావున చిల్లర విషయాలైన పేదరికం, బీదల పాట్లు, సమాజ స్థితిగతులు మాకు పట్టవ్. అసలు వాటి గురించి ఆలోచించేందుకు కూడా మా అమూల్యమయిన జీవితంలో సమయం లేదన్నట్లు "ప్రవర్తించడం ఈ తరం చదువులకొక ఫ్యాషన్. అది వారి ప్రతీ చర్యలోను కనిపిస్తూనే ఉంటుంది.

వానాకాలం కాగితపు పడవుల బాల్యం ఈనాడు కంప్యూటర్‌లో తుపాకీ ఆటలు ఆడుతూ పుట్టుకతోనే తప్పుడు విధానాలకి అలవాటు పడుతోంది. మానసికంగా మనషులందరినీ దూరం చేయడం వలనే, ప్రతీ చిన్న శుభసందర్భాన్ని సంతోషంగా జరుపుకుంటున్నామని తృప్తిపడే పార్టీల సంస్కృతిని ఈసరికే ప్రజలకి బాగా అలవాటు చేయడం జరిగింది. భౌతికంగా నలుగుర్ని పిలిచి మన ఘనతను,

గుర్తింపును ప్రదర్శించుకోవడమే సంతోషకర జీవన చిహ్నంగా చూడబడే వ్యవస్థలో లాభాపేక్షనేది లేకుండా, ప్రతిఫలం ప్రసక్తి రాకుండా మనుగడ సాగిస్తోన్న సాంఘిక విలువల ఉనికి నైతిక వ్యక్తిత్వాలతో సహా అంతర్ధానమయిపోయే పరిస్థితి తలెత్తింది. కొద్దోగొప్పో మనిషిపట్ల విశ్వాసం ప్రకటిస్తోన్న ప్రజా ఉద్యమాల సాంగత్యంతోనయినా సాంఘిక పరిణితికి తలుపులు తెరిచే వ్యక్తిగత వైఖరుల్ని నిర్మించుకోడానికి ప్రజలు ముందురావడం ముదావహం.

" If you prick us, do we not bleed? If you ticle us, do we not laugh? If you poison us, do we not die? and if you wrong us, shall we not revenge?"

**- William Shakesphere**

( The Merchant of Venice)

---

ఎంతవరకైతే గుప్పెడు మంది పరాన్న భుక్కులు భారత శ్రామిక జనాన్ని ప్రకృతి వనరులను దోపిడి చేస్తుంటారో అంతవరకు పోరాటం ఉంటుంది. ఉండి తీరుతుంది. వారు కేవలం బ్రిటీష్ పెట్టుబడిదారులు కావచ్చు. లేదా భారత పెట్టుబడిదారులు కావచ్చు. వారు తమ మోసపూరిత దోపిడీని కొనసాగిస్తున్నంత వరకు ఈ పోరాటం కొనసాగుతుంది.

**- భగత్ సింగ్**

---

ఒక వ్యక్తి ఎన్ని పొండ్ల మాంసం తిన్నాడని కాదు. సంవత్సరంలో ఎన్ని సార్లు బీచ్‌కి షికారుకు పోయాడని కాదు. తన సంపాదనతో విదేశాలనుండి ఎన్ని ఆభరణాలు కొన్నాడని కాదు. ఒక వ్యక్తి తన భాధ్యతలను నిర్వహిస్తూ ఎంత ఆత్మ సంతృప్తిని పొందుతున్నాడన్నది ముఖ్యం.

**- చేగువేరా**

## తుదిపలుకు

"Without deviation progress is not possible."

*- Frank Zappa.*

ముందడుగేయడం చులకనగా చూడబడుతున్న వ్యవస్థలో ఉన్నాం మనం. మనంతట మనం సహాయాన్ని కోరడం కోసం ముందుకు రావడాన్ని తమ గొప్పతనంగా భావించే సంప్రదాయం పెరిగిపోతోంది. మన అవశరం ఎదుటివారికుందని తెలిసి కూడా అవతలివారిచేత అడిగించుకోవాలనే కుతి ' అర్థించక చస్తారా, అడక్క పోతారా ' అనే వికృత మనస్తత్వాన్ని తెలీకుండానే మనలో అభివృద్ధి చేస్తోంది. సాయం పొందిన వారి స్థాయిని కుదించి చూడడం నాగరికత నుంచి మనం నేర్చుకున్న మరో పాఠం.

సరితూగగలమని తెలిసి కూడా స్పందించకుండా వుండిపోవడం క్రమంగా, స్పందించవలసిన స్థితిలో సైతం నిర్లిప్తంగా మిగిలిపోయమే వైఖరికి అంతిమంగా దారితీస్తుంది. సమాజంలోని మానవ సమూహాలకి, స్మశానాలలోని శవాల సమాధులకీ వ్యత్యాసం లేని వ్యవస్థని తయారుచేయడమే ఆధునికులుగా మన విధానాల పరమార్థమయితే, పెట్రేగిపోతోన్న అమానవీయతకి సరిసమానంగా మనమందరం బాధ్యత వహించాల్సి వస్తుంది. వెర్రితలలు వేస్తున్న నాగరికతకి వారసత్వాన్ని ఇచ్చింది మనమేనని ఒప్పుకోవల్సి ఉంటుంది.

ఆర్థికాభివృద్ధి కోసం మనం చేస్తున్న కృషిలో వెయ్యోవంతయినా హార్థికాభివృద్ధి గురించి చేసుంటే ఆశించినంతగా కాకపోయినా ఆశాజనకంగానయినా ప్రజాసమూహాల్లో ప్రతిస్పందన సాధ్యమై వుండేది. స్పష్టంగా మనది కాని మన వ్యక్తిత్వాన్ని నిసిగ్గుగా ప్రదర్శించుకోవడం కోసం ఆధునికత పేరుతో అర్రులుచాచే మనం, యదార్థంగా మన స్వంత వ్యక్తిత్వాన్ని చేజేతులా నాశనం చేసుకుంటున్నామనే నిజం ఏదోనాడు మనమెప్పుకోవల్సిన పరిస్థితి పశ్చాత్తాపంతో నిండి రాక మానదు.

మారుతున్న కాలంతో మారడమంటే దానర్థం మన జీవన సంస్కృతిని వినాశనం చేసే విదేశీ వెర్రిని ఆశ్రయించడంకారాదు. మరణిస్తున్న వ్యవస్థలో జీవత్వాన్ని పెంపొందించలేని ఉద్విగ్నతలు, ఉద్రేకాలు ఉబుసుపోలు కబుర్లుగానే గుర్తించబడతాయి తప్ప ఉద్యమ స్థాయిని అందుకోలేవు. అసంఖ్యాకమయిన తిరోగమన కుట్రలతో తీవ్ర నిర్లిప్త ధోరణులతో నిరాశాజనకంగా నత్తనడక నడుస్తున్న వ్యవస్థ పట్ల అసమ్మతితో కూడిన తీవ్ర నిరశన తెలిపే తాత్విక అక్షరాల అవశరం ఈనాడు మరింత స్పష్టంగా తెలుస్తోంది.

ఓటమి భారంతో కృంగిపోతున్న సంఘర్షణా సంస్థల్నుంచి, ఒంటరిగా ఎదురీదుతున్న వుద్యమ నేపథ్యంగల వ్యక్తులదాకా ప్రతి ఒక్కరికి వ్యక్తిగతంగా సమాజానికి ప్రాతినిధ్యం వహిస్తూ తమ బాధ్యతల్ని కూడా అందుకోసమే భాగం చేసే భావాత్మక చలనం కావాలి. అనేక భయంకరమయిన పరిస్థితులలో అపారమయిన ఆత్మీయ సమూహాలనెన్నిటినో కోల్పోయి కూడా ఏదో తెలీని తెగువతో గడ్డు కాలం గడుపుతున్న గరీబుల్ని కదిలించే విశ్వాసం సృష్టించాలి.

అదే నా అక్షరాల ఆర్తనాద ధ్వని. అదేనా పదవిన్యాసాల పవిత్ర విధి. అదే అరాజకవాద ప్రదాన పరిధి. ఒంటిచేతి ఉద్యమకారుడంటూ అయినవాళ్ళూ, ఒంటెద్దు పోకడ సిద్ధాంతమంటూ కానివాళ్ళూ, తోచిన ప్రచారం చేస్తున్నా ఆశ్రయించిన నిజాన్ని అక్షరాలుగా మలచగలనన్న ఆతృతే ఇప్పటికిక్కడివరకూ నన్ను నడిపించగలిగింది. అనుకున్నంతలో వెయ్యోవంతు కూడా ఆచరణలో చేయలేకపోయాననే అసంతృప్తి అస్తమానూ వెంటాడుతూనే వుంటుంది.

ఈ దేశంలో అనేక ప్రాంతాల్ని సందర్శించిన నాకు అన్నిచోట్లా అగుపించిన ఏకైక అంశాలు ఏవయినా వుంటే అవి ఆకలి, అంటరానితనం, అసమానతలు. ప్రతీ ప్రదేశంలోనూ ఎంతో కొంత బలంగా ఇప్పటికీ అవి తమ అస్తిత్వాన్ని కాపాడుకుంటూనే ఉన్నాయి. అటువంటి పరిస్థితులే నా అక్షరాలకి ప్రేరణ. మనకి జరుగుబాటుకి లోటు రానంత వరకూ జరుగుతున్న దోపిడీకి ఎన్నిరకాల ముద్దుపేర్లయినా పెట్టుకుని మన చాతకానితనాన్ని సమర్ధించుకో చూడొచ్చు

" ఒక రచయితకి ప్రతీదీ తెలసి వుండాలి. లేదా కనీసం అవకాశం వున్నంత తెలిసి వుండాలి. అనుభూతుల సందోహంలోంచి, ఉద్రేకాల కీకారణ్యంలోంచి సర్వసామాన్య ప్రాముఖ్యమూ నమూనా ప్రాయము అయినవాటిని అతను ఎంచుకోగలిగి వుండాలి.... ఉద్దేశపూర్వకంగాకాని, అనుద్దేశపూర్వకంగాకాని సర్వకళలకీ ఉండే ప్రయోజనం ఏమిటంటే మానవుడిలో కొన్ని అనుభూతులని జాగృతం చేయడం. " అంటాడు మాక్సింగోర్కి. యువ రచయితల పాలిటి నిత్య సత్యాలయిన ఆయన వాక్కుల్నించి నేనెంతో గ్రహించాను.

అసంబద్ధంగా ఉపయోగిస్తున్న అరాజకవాద పదానికి సరైన అర్థం చెప్పాలనుకున్నానే కాని అరాజకత్వ సిద్ధాంతానికి బాష్యం చెప్పాలనే ఉద్ధేశమేదీ ఆరంభంలో నాకు లేదు. అయితే, అంతకంతకూ పెట్రేగిపోతోన్న అనాగరిక ధోరణులు, దినదినాభివృద్ధి చెందుతున్న అప్రజాస్వామ్య దృక్పధాలు, యదార్ధ ప్రజాస్వామ్య వాదమయిన అరాజకత్వాన్ని గురించి కాస్త లోతైన పరిశోధనకే నన్ను ప్రోత్సహించాయి. ఇక తెగించక తప్పలేదు.

ఆ ప్రయత్న ఫలితంలో ఒక భాగం మీరు చదివారు. చాలావరకూ అర్ధవంతంగానే వుందని అనుకుంటున్నాను. అక్కడక్కడా పొరపాట్లు దొర్లే అవకాశమయితే లేక పోలేదుకాని అడ్డగోలుగా వాదించలేదని మాత్రం చెప్పగలను. ఏది ఏమయినా ఆశించినంత స్పష్టంగా ఇంకా సులభశైలిలో అక్షరాలని రచించాలనే ఆకాంక్షయితే వుంది కానీ, అంత త్వరగా అది ఒక రూపం ధరిస్తుందనుకోను. అభ్యుదయ యత్నంలో అందరి ఆకాంక్షల్ని భాగం చేయాలని చూడడం చెడు కాదు కదా!

వివేకాభినందనలతో

గౌరవ్

---

"ఎందరో రచయితలు ఒకటి రెండు పుస్తకాలు అచ్చుపడగానే అశ్వఘోషుడిలాగానో, కాళిదాసులాగానో తాము శాశ్వత కీర్తిని సంపాదించామనుకుంటూ ఉంటారు. కానీ ఈ పుస్తకాలను అచ్చు వేసే కాగితాలు చాలా కొద్దికాలంలో జీర్ణించిపోతాయి. ఈ కాగితాలతో కుట్టిన పుస్తకాలు ఒక్క వంద సంవత్సరాలయినా నిలవ్వు. ముద్రణాలయాలు వచ్చాక పుస్తకాలు అచ్చు వేయడం తేలిక అయింది. ప్రతి సంవత్సరం లక్షల సంఖ్యలో కొత్త పుస్తకాలు అచ్చవుతున్నాయి. దేశంలో విద్యాప్రచారం పెరిగిన కొలదీ అచ్చయ్యే పుస్తకాల సంఖ్య పెరుగుతోంది. ఒక వెయ్యి సంవత్సరాల తర్వాత ఈ పుస్తకాలన్నీ జాగ్రత్త చేయాలంటే ఎన్ని ఇండ్లు అవశరమో ఆలోచించండి. అసలు విషయం ఏమిటంటే, ప్రతి తరమూ వచ్చే తరం మీద తమ కీర్తిని రుద్దాలని చూడడం చాలా మూర్ఖత్వం. మనకు ముందు గడిచిపోయిన, మన పదితరాల పూర్వీకులు తమ పేర్లన్నీ మనం జ్ఞాపకం వుంచుకోవాలని కాంక్షించారనుకోండి. అలా పది తరాల పూర్వీకుల పేర్లను జ్ఞాపకముంచుకోవడం సంభవమా? ఒకవేళ సంభవం అవుతుంది. ఎందరివో కొందరి పేర్లన్నా జ్ఞాపకం వుంచుకున్నాం అనుకోండి. అందువల్ల ఒరిగే లాభం? మనం కాలం అయ్యాక మనం తప్పకోవడం ఓ గొప్ప నీతి."

-రాహుల్ సాంకృత్యాయన్, ఘుమక్కడ్ శాస్త్ర
(లోకసంచార శాస్త్రం)

" There are periods of the life of human society when revolution becomes an imperative necessity, when it proclaims itselt as inevitable. New ideas germinate everywhere seeking to force their way into the light, to find an application in life; every where they are opposed by the inertia of those whose interest it is maintain the old order; they suffocate in the stifling atmosphere of prejudice and traditions. The accepted ideas of the constitution of the state, of the laws of social equilibrium, of the political and economic interralations of citizens, can hold out no longer against the implacable criticism which is daily undermining them whenever occasion arises, - in drawing room as in cabaret, in the writings of philosophers as in daily conversation. Political, economic and social institutions are crumbling; the social structure, having become uninhabitable, is his even preventing the development of the seeds which are being propagated within its damaged walls and being brought forth around them."

**- *Peter Kroptkin*,**
The spirit of Revolt

# కొసరుకి విసరు

క్రిస్టోఫర్ కాడ్వెల్ రాసిన 'Illusion and Reality' అనే ఉద్గ్రంథాన్ని తాను జీవిత తపస్సుగా అనువదించి ఉన్నానని దానిని అచ్చుకి తెచ్చి, బయటపడేలా చూసే బాధ్యత నీదేనంటూ ఒక కమ్యూనిస్టు కవి ఆ మధ్య చేతులు పట్టుకుని అడిగిన అర్థింపుకి సరేనన్నాను. అంతకు మునుపే ఆంధ్రదేశంలో ప్రసిద్ధిచెంది నిజాముచేత ఆరోజుల్లో నిషేధించబడిన సంచలన గ్రంథంతో పాటుగా, ఆత్మకథను మొదలుకుని అనేక సంవత్సరాల్నుంచి దిక్కూమొక్కు లేకుండా పడివున్న ఇదే రచయిత అచ్చుప్రతులను సవరించి అచ్చేయిస్తే దక్కిన అవమానకర ప్రతిఫలాన్ని గుర్తుకు తెచ్చుకుని కాస్త సందేహంతోనే అయినా అనువాదం తాలుకు తప్పులన్నింటినీ దిద్ది, పలుమార్లు ప్రూపుని తరచి చూసున్న సమయంలో అందులో నాకు ప్రత్యేకంగా కృతజ్ఞతలు చెప్పడం అవశరమని వాదిస్తూ, కాదంటే అసలాపుస్తకాన్ని ముద్రించడమే మానుకుంటానంటూ మొండిపట్టు పడితే అలాగే కానిమ్మన్నాను. ఈ లోపులో మళ్ళీ అభిప్రాయ బేదాల్తో మేమిద్దరం వేరయ్యాం.

పుస్తకం అచ్చయి వచ్చింది. నా పేరు కనబడకపోయే మాట పక్కన పెడితే సామాన్యుడు ఆలోచించనంత అధిక ధర నిర్ణయించడం జరిగింది. ఈ ప్రస్తావన దేనికంటే ఇలాంటి పనులు అల్పుల పసి మనసుని స్ఫురింపజేసేవేకానీ, నిజాయితీతో చేసిన మన కృషిని మరుగుపరిచేవి కావు. అనారోగ్యంతో కుంగిపోతున్న అకాలంలో ఆయనపై జాలితో నేనిష్టపడి చేసిన కృషికి కీర్తి కాంక్షలేదు. ఉన్నదల్లా క్రియాకాంక్షే. ఈ సందర్భంగా నా "వ్యక్తిత్వం - అరాజకత్వం " అనే కరపత్రంలోని ఈ వాక్యాల్ని ప్రస్తావించడం అనుచితం కాదనుకుంటాను.

" ఆర్జించిన జ్ఞానాన్ని అందించేందుకు అక్షరమొక సాధనం. లిఖించబడిన అక్షరాలు మానుష గమనాన్ని ఎంత త్వరితంగా ఏ రీతిన ఉన్నతీ కరిస్తాయనే అంశం మీదే అక్షరకర్త అస్తిత్వం పరగణించ వీలవుతుంది కానీ అతడు రాసిన మహాగ్రంధాల మోతని తూకంతో తూచో, ఒకడు కూర్చిన కావ్య ప్రభంధాల ఊకని వృధా ఊతంతో ఎంచో రచయితని అంచనా వేయరాదు. అక్షరాలకి కొలయానం నిర్దేశించడం అమాయకత్వం. విజ్ఞానానికి వాదాల్ని అంటగట్టడం మూర్ఖత్వం. మార్పుని ఆహ్వానించడమొక్కటే మానుషత్వం. అలాంటి మానవ తత్వాల్ని క్రమబద్ధం చేసే అక్షరాల్ని సృజించడమే సామాజిక రచయితల విధి. వ్యవస్థని విప్లవీకరించే మానవాళికి అలాంటి అక్షరాలే మహోన్నత నిధి!!"

మనిషి చేసిన సుదీర్ఘ ప్రయాణంలోని అనుభవాల లోతులు ఎప్పుడూ అతడి

ఆంతరిక చైతన్యాన్ని శక్తివంతంగా ప్రజ్వలింపచేయడానికి ప్రయత్నిస్తూనే వుంటాయి. మరో మనిషి అస్తిత్వాన్ని గురించి కూడా పవిత్రంగా ఆలోచిస్తూ సమాజాన్ని ఎప్పటికప్పుడు పునరుత్తేజం కావించే విప్లవ తరాలెప్పుడూ వాటి గాఢమైన గాథల్ని విస్తరిస్తున్న కాలంతో పాటు వినమ్రంగా రాబోయే కొత్త తరాలకు వినిపిస్తూనే ఉంటాయి. మానవుడ్నే మహనీయుడుగా, మానవత్వాన్నే మహోన్నతమయిన మహిమాన్వితంగా మనసులో పదిలపరుచుకుని ముందుకు సాగిన జీవన మార్గాలన్నీ, అవే దరికి చేరినా మహాకాల యోధుడయిన మనిషి గత చైతన్య చిహ్నాల్ని చరిత్రలో చిరస్థాయిగా రక్షిస్తూనే ఉంటాయి. ప్రజానీకంలో వ్యక్తుల జీవితాలను పరిపూర్ణంగా ప్రతిఫలించే, సంపూర్ణంగా సంప్రదించే సాంఘిక ఔన్నత్యానికి సమాజగమనంలో సమానత్వ సాధనను మించిన సజీవసాక్ష్యం లేదు.

ఇతి శివమ్ !

---

"Man is mortal. Everyone had to die some day or the other. But one must resolve to lay down one's life in enriching the noble ideas of self respect and in bettering one's human life. We are not slaves. Nothing is more disgraceful ofr a braveman than to live life devoid of self-respect.

**Dr. B.R. Ambedkar**

# కొన్ని ఉపయుక్త గ్రంథాలు

1. Evolution And Revolution by Elisee Reclus
2. Anarchism verses Socialism by Wm.C.Owen
3. The End of Dialectical Materialism : An anarchist reply to the libertarion Marxists by P. Murtangh
4. The spirit of Revolt by Peter Kroptkin
5. The individual, society and the state by E.Goldman
6. Stateless socialism: Anarchism by M.Bakunin
7. Prisons : A social crime and failure by E.Goldman
8. Organised vengeance called "Justice" by P.Kroptkin
9. Listen, Marxist by Murray Bookchin
10 Patraitism : A menance to liberty by E.Goldman
11 Anarchism : what it really stands for by E.Goldman
12 God and state by M.Bakunin
13 Communism and Anarchy by Peter Kroptkin
14 An appeal to the young by Peter Kroptkin
15 Anarchism : Its philosophy and ideal by P.Kroptkin
16. Words of a Rebel by P.Kroptkin
17. Towards Anarchism by Errico Malatesta
18. The idea of good government by Errico Malatesta
19. The philosophy of atheism by E.Goldman
20. Why Anrchists don't vote by Elisee Reclus
21. On order by Peter Kroptkin
22. Marriage, love and the sex question by E.Goldman
23. Anarchy and the sex question by E.Goldman
24. War by....
25. What is Anarchism published by workers Solidarity movement, Dublin, Ireland
26. The Anarchist manifesto
27. Political justice by Godwin
28. The necessity of atheism by P.B.Shelly
29. Works of Karl Marx 1874 Conspectus of Bakunins statism and Anarchy
30. Adventure of ideas by A.N. Whithead
31. The value of adventures by Han Zhen
32. Articles by che-gue-vara from sierra Maestra
33. Communist Manifesto by Marx & Angels
34. The origin of family, private property and state by F.Angels.
35. Das Capital by Karl Marx
36. Anti-During by F.Angels.
37. Complete works by Lenin
38. Historical Dialectieal Materialism by Stalin
39. History of western philosophy - B. Russel
40. The mind and face of Bolshivism
41. Glimsis of the world history - J.L. Nehru
42. Discovery of India - J.L. Nehru
43. Works of B.R.Ambedkar
44. Works of M.N. Roy
45. Why I am an atheist and other works by B.singh
46. Complete works of M.K.Gandhi
47. Works of Jean-Paul-Satre
48. Rights of Man by Thomas Paine
49. Philosophical and ideological works of Encyclopedia Britanica
50. Other works, Concepts through internet
51. My own works and around fifty pamphlets
52. EminentworksofGodwin,Proudhan,Kroptkin, Lala hardayl etc.

ఆర్థికంగా స్థిరపడి అక్షరాలకి ధర నిశ్చయించుకోమన్న వాళ్ళు, అక్షరాల్ని అమ్ముకొని ఆర్థికంగా నిలదొక్కుకొమ్మన్నవాళ్ళూ, అసలవన్నీ నీకెందుకంటూ ఆడిపోసుకున్న అభిమానులు, అందరిలా ఉండలేవా? అంటూ అంతెత్తులేచే చిద్విలాసపరులూ, ఇల్లు చక్కదిద్దుకున్నాక సంఘం గురించి ఆలోచించమంటూ సలహాయిచ్చే శ్రేయోభిలాషులూ, ఇలా నా మంచి కోరిన వారందరికి మనస్పూర్తిగా వందనాలు తెలుపుకోగలనే కాని అంతరాత్మతో సంపూర్ణంగా విభేదించి నన్ను నేను మోసం చేసుకోలేను. ఎప్పటికప్పుడు కొత్త చేతనత్వానికి సిద్ధపడే నా స్వభావం తాత్కాలిక బెదిరింపులకి తలొంచిందంటే దానర్థం మరొకరిని కష్టపెట్టకూడదనే తప్ప మానసికంగా ఇష్టపడి మాత్రం కాదనేది స్పష్టం.

అన్యాయాలు, అక్రమాలు పెరిగిపోతున్నాయంటూ కుదిరినప్పుడల్లా కబుర్లు చెప్పుకొనే వారి కోవలోకో, తోచినప్పుడల్లా మంచికి ఇవి రోజులు కావంటూ గొంతులు చించుకునే వారి తోవలోకో, అడపాదడపా పనికి మాలిన ఆవేశాలతో అరిగిపోయిన నినాదాలెత్తుకొనే ప్రబుద్ధుల వరుసలోకో అల్లంత దూరంలో నిలబడి ఆచరణో.. ఆచరణంటూ అరిచి గీపెట్టే బడుద్ధాయి బారులోకో నేను కూడా చేరిపోయి నలుగురితో నారాయణ, కులంతో గోవింద అనుకొనే మందతో సహా అమ్ముడుపోయి అంతరాత్మకి పంగనామాలు పెట్టుకోదలచుకోలేదు. నిత్యం బుగ్గిపాలవుతున్న కోట్లాది మంది యువజనుల వర్తమాన జీవితాల కన్నా నా భవిష్యత్తేమి గొప్పది కాదు. అయినా గొప్పతనం కాలానికి ఎదురీదిన వ్యక్తిత్వాల్లో వెతకాలే కాని, కుదేలుపడిన బతుకుల్లో కాదు.

కదలిక చైతన్యానికి, నిర్లిప్తత నిర్జీవానికి చిహ్నాలు. కాబట్టి, ఇప్పటికైనా బడలిక వదిలి కదలడానికి ప్రయత్నించడం మనుషులుగా మన అస్తిత్వాన్ని నిరూపించడానికి పనికొచ్చే కనీస ప్రమాణమేమో!